

గాంధీజీ జన్మదినోత్సవం : సమాధివద్ద నెహ్రూ పుష్పాంజలి సమర్పించారు.



చైనా పీపుల్స్‌రిపబ్లిక్ వార్షికోత్సవం : చైనా రాయబారి చేసినవిందులో నెహ్రూ, చైనారాయబారి, డా. సుబాన్ పతీర్ (ఇండోనీషియా)



# విషయానుక్రమణిక
## అక్టోబరు 10-1951

ముఖచిత్రం:

"పెళ్ళిచేసి చూడు"లో కుమారిగిరిజ.

రాజకీయాలు:



సీరియల్:



కథానికలు:



నాటిక:



సినీమా:



బొమ్మరిల్లు:



గేయం:



("జంతువులు-పక్షులు" శీర్షికలోని బొమ్మలు మద్రాసు కార్పొరేషనువారి సౌజన్యంతో.)



# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా రు. 12-0-0
విడిప్రతిక 4 అణాలు

ప్రతి బుధవారము ప్రకటింపబడును

Founder : K. NAGESWARA RAO

సంపుటము 43
సంచిక 56
10-10-51

ఖర సంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమి బుధవారము

# ఆంధ్రరాష్ట్రం: నెహ్రూ లేఖ

ఆంధ్రరాష్ట్రం కోసం ప్రాయోపవేశం పూని 35 రోజుల తరవాత విరమించిన స్వామి సీతారామ్‌గారికి పండిట్ నెహ్రూ తమ అభిప్రాయాన్ని తెలుపుతూ లేఖ వ్రాశారు:

“భాషారాష్ట్రాలను గురించి నా వ్యక్తిగతాభిప్రాయం ఎలా ఉన్నప్పటికీ, ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించడానికి, ఆంధ్ర ప్రజానీకం అంతా కాంక్షిస్తున్నారన్న హేతువొక్కటే చాలు” అని నెహ్రూ తమ లేఖలో వ్రాశారు.

భాషారాష్ట్రాలను గురించి నెహ్రూ తమ అభిప్రాయాన్ని అనేక పర్యాయాలు ప్రకటించారు. జె. వి. పి. రిపోర్టు ఈ అభిప్రాయాన్ని స్పష్టపరిచింది. బెంగుళూరు సమావేశంలో ఆలిండియా కాంగ్రెస్ కమిటీ ఆమోదించిన కాంగ్రెస్ ఎన్నికల నివేదికలో భాషారాష్ట్రాలనుగురించి ఇటువంటి అభిప్రాయమే ప్రకటించబడింది. నెహ్రూ అభిప్రాయం ప్రకారం భాషారాష్ట్రాల నిర్మాణం గురించి ఆయా ప్రాంతాల ప్రజలే అంతిమ నిర్ణయం చెయ్యాలి. కాని భాషా భేదాలను అక్కడక్కడ పాటింపవలసివచ్చినప్పటికీ, ఆర్థిక పరిపాలనాది సౌకర్యాలను ప్రధానంగా గమనించవలసిఉంటుంది. ఆయా ప్రాంతాల ప్రజలందరికీ సమ్మతమైనప్పుడు, ఆయా భాషారాష్ట్రాలను నిర్మించడానికి కాంగ్రెస్ ప్రభుత్వం తగు చర్యలు తీసుకోగలదు. (తగు చర్యలు అంటే సరిహద్దు నిర్ణాయకసంఘ నియామకం కూడా నని స్పష్టంగా తెలపబడింది.)



పండిట్ నెహ్రూ

జె. వి. పి. రిపోర్టులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అట్టే ఆటంకాలు లేవని చెప్పబడినందువల్ల ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్, తమిళ కర్నాటకరాష్ట్ర కాంగ్రెస్‌లు, మద్రాసు ప్రభుత్వమూ జె. వి. పి. రిపోర్టును ఆమోదించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి గల ముఖ్య ఆటంకాన్ని తొలగించాయి. అయితే విభజనసంఘం సమర్పించిన నివేదికలో పరిష్కరించబడని సమస్యలు కొన్ని ఉన్నాయనీ, మద్రాసు నగరాన్నిగురించి ఆంధ్రదేశ నాయకులు సంకోచాలను విడిచిపెట్టలేదనీ హేతువులను చూపి, కేంద్రప్రభుత్వం విభజనసంఘ నివేదిక ప్రకారం ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించడానికి నిరాకరించింది.

తిరిగి ఆంధ్రరాష్ట్రసమస్య ఇప్పుడు వచ్చినందువల్ల, పూర్వ సంకోచాలను విడిచిపెట్టి ఆంధ్రదేశనాయకులు ఏకీభావానికి రాగలగాలని నెహ్రూ సలహా ఇచ్చారు. వెంటనే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ నెల్లూరులో సమావేశమై విభజనసంఘనివేదికను ఆమోదిస్తూ తీర్మానం చేసింది.

## కర్ణాటక కాంగ్రెస్ తీర్మానం:

తక్షణం ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలని కోరుతూ స్వామి సీతారామ్ గారు ప్రాయోపవేశదీక్ష పూనినప్పుడు, తక్షణ ఆంధ్రరాష్ట్రనిర్మాణంపట్ల సంపూర్ణామోదం ప్రకటించిన శ్రీ నిజలింగప్పగారు,

నెహ్రూగారి ప్రకటనల అనంతరం తమ వైఖరిని మార్చుకున్నారు. ఇప్పుడే కాదు. ఇదివరలో, అనగా విభజనసంఘ పరిశీలన సమయంలో కూడా కర్నాటక కాంగ్రెస్ నాయకులు ఇదేవిధంగా చేశారు.

దీనికి ఇతర భాషా రాష్ట్రాల పట్ల పండిట్ నెహ్రూ వైఖరే కారణం. జె. వి. పి. రిపోర్టును గమనించినా, ధార్ కమిషన్ రిపోర్టును గమనించినా, ఆంధ్ర రాష్ట్రం మినహా ఇతర భాషారాష్ట్రాలను ఇప్పటిలో నిర్మించడానికి అవకాశం కనపడదు. అందువల్లనే కర్ణాటక కాంగ్రెసు నాయకులు ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని ఒక విధంగా బలపరిచినా, ఆంధ్రరాష్ట్రంతో పాటే తమ రాష్ట్రాన్ని కూడా సాధించుకోవాలనే ఉద్దేశంతో, ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి అడ్డుపడుతూ వస్తున్నారు. బళ్లారిజిల్లావిషయమై పూర్వ నిర్ణయాలను త్రోసిపుచ్చి, చేతికి చిక్కినంత ఆంధ్రులకు చెందిన సమీప ప్రాంతాల్ని లాక్కోవాలని కూడా ప్రయత్నిస్తున్నారు.

ఈ సందర్భంలో కర్ణాటకులు రెండు ముఖ్యవిషయాలను మరిచారన్నమాట. మైసూరు సంస్థాన భవిష్యత్తు తేలేవరకూ, బొంబాయి, మద్రాసు, హైదరాబాద్ల విభజన జరిగేవరకూ కర్ణాటకరాష్ట్ర నిర్మాణం సాధ్యపడదు. అదీకాక మొదటి నుంచీ స్వపరిపాలన వ్యవస్థలో ఉన్న మద్రాసు బొంబాయి రాష్ట్రాలలోని కన్నడప్రాంతాలను, ఇప్పుడిప్పుడే ప్రజాస్వామ్య సిద్ధాంతాల ప్రకారం పరిపాలన స్థాపించుకుంటున్న మైసూరులో చేర్చడం క్షేమం కాదు. అలా చేర్చాలని కొందరు చేస్తున్న కృషిని కాంగ్రెస్ వాదులైన కన్నడ నాయకులే ప్రతిఘటించడానికి బదులు, మహారాజాఆధ్వర్యంకిందకు మద్రాసు బొంబాయిరాష్ట్రాలలోనికన్నడ ప్రాంతాలను తీసుకుపోవాలని ప్రయత్నిస్తున్నారు. ఇటువంటి అనాలోచిత కార్యాలవల్లనే భాషా రాష్ట్రోద్యమం సంకుచితమైనదనే విమర్శలను గురౌతున్నది.

బళ్ళారిజిల్లా విభజనలో ఆంధ్రులకే అన్యాయం జరిగినప్పటికీ కేల్కార్ నిర్ణయాన్ని ఆంధ్రులు ఆమోదించారు. కర్ణాటకులు ఆనాడు ఆమోదించి, తిరిగి ఈనాడు బళ్లారిజిల్లానంతటినీ కోరడంలో న్యాయం లేదు; కేవలం ఆంధ్రరాష్ట్రనిర్మాణాన్ని నిరోధించడానికే వారి వాదం లేవదీశారని అనుమానించవలసి వస్తున్నది.

జె. వి. పి. రిపోర్టువల్ల భాషారాష్ట్రాలను కాంక్షించేవారందరికీ ఆశాభంగం కలిగినప్పటికీ, సక్రమమైనా అక్రమమైనా దానిని ఆంధ్రు లంగీకరించవలసివచ్చినప్పుడు, ఇతర భాషా ప్రాంతాలవారు ఆ రిపోర్టుపట్ల తమ అభిప్రాయాలను స్పష్టంగా ప్రకటించలేకపోయినారు. ఇతర భాషా రాష్ట్రాల నిర్మాణం ఇప్పటిలో ఒనగూడదని ఆ రిపోర్టు స్పష్టపరిచినప్పుడు విమర్శించినా సరిపెట్టుకున్నా ఆ భారమంతా ఆంధ్రులపైనే పడింది. ఆనాడు కర్ణాటకులు మహారాష్ట్రులు అర్ధమనస్కమైన కొన్ని ప్రకటనలు చేసి ఊరుకున్నారేకాని తమ రాష్ట్రవాంఛ ప్రబలమైనదని నిరూపించుకోలేకపోయినారు.

ఈనాడు తిరిగి నెహ్రూ ఆ రిపోర్టు ప్రకారమే వ్యవహరించగలరని స్పష్టపరి



స్వామి సీతారామ్

చినతరవాత కర్ణాటకులు తమ రాష్ట్ర నిర్మాణంకోసం ఉద్యమం నడపవలసినది మానుకుని ఆంధ్రరాష్ట్రాన్ని నిరోధిస్తున్నారు. ఆంధ్రరాష్ట్రనిర్మాణం బాగోగులపై తమ రాష్ట్రాల భవిష్యత్తు ఆధారపడి ఉన్నదని కర్ణాటకులు గ్రహించకపోవడం శోచనీయం.

మైసూరుతో భారతప్రభుత్వం చేసుకున్న ఒడంబడిక, ఆ సంస్థాన భవిష్యత్తు మొదలైన అనేక సమస్యలతో కూడుకున్న కర్ణాటకరాష్ట్ర నిర్మాణసమస్య ఈనాడు పరిష్కారం కావడం అసంభవం. హైదరాబాద్లోని తెలంగాణా, ఒరిస్సాలోని బరంపురంప్రాంతాలతో నిమిత్తం లేకుండా, కేవలం మద్రాసురాష్ట్రంలోని తెలుగుప్రాంతాలతోనే ఆంధ్రరాష్ట్రం నిర్మించడానికి ఇన్ని సమస్యలు, తగవులు ఉత్పన్నమైనాయి. ఇంక మైసూరుసంస్థాన భవిష్యత్తు, హైదరాబాద్ బొంబాయి మద్రాసురాష్ట్రాల విభజనలతో సంబంధించిన కర్ణాటక రాష్ట్రనిర్మాణం మరింత కష్టమని కర్ణాటకనాయకులు గుర్తించాలి. ప్రశాంతవాతావరణంలో తగవులు రానీయకుండా, సమీప ప్రాంతాలవారితో సఖ్యతాభావంతో రాష్ట్రం సంపాదించుకోడానికి ఆంధ్రులు చేస్తున్న కృషికి ఇన్ని ఆటంకాలు వస్తుండగా ఒక సంస్థానాన్ని రెండు రాష్ట్రాలను విభజించి ఆంధ్రులు, తమిళులు, మహారాష్ట్రులు కేరళులతో సఖ్యతతో రాష్ట్రం సంపాదించుకోవడం సామాన్యం కాదు. ఆంధ్రుల రాష్ట్రంపట్ల అక్రమవైఖరి నవలంబిస్తూన్న కన్నడులు, తమ రాష్ట్రంకోసం ఇతరుల సద్భావాన్ని పొందవలసిన అవసరాన్ని మరిచిపోకూడదు.

ఇట్టి వైఖరివల్ల కర్ణాటకులు ఆంధ్రులకు ఏ కొద్దిపాటో హాని చెయ్యగలరే కాని, తమ రాష్ట్రాన్ని తెచ్చుకోలేరు. అంతే కాదు. సరిహద్దుప్రాంతాల సమస్య మరింత క్లిష్టం కాగలదు. నెహ్రూ ఇట్టి సమస్యలనే భాషారాష్ట్ర నిర్మాణానికి ప్రమాదకరమని చెప్తున్నారు.

మరొకమాటను కర్ణాటకులు మరిచారు. ముందు ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించి, రాష్ట్ర విభజన కలాపం ఏ రీతిగా కొనసాగుతుందో పరిశీలించి, ఈ అనుభవాన్ని ఊతగా తీసుకుని ఇతర భాషారాష్ట్రాల నిర్మాణం సంగతిని యోచించగలరని జె. వి. పి. రిపోర్టులో నాయకులు సూచించారు. ఈ విషయాన్ని మరిచి ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని నిరోధిస్తే, భాషా రాష్ట్రాల నిర్మాణంగురించిన ఆశకు మొదటికే మోసం రావచ్చును.

## నెహ్రూలేఖ:

ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం సమ్మతించే ముందు అనేకక్లిష్ట సమస్యలు పరిష్కారం కావలసిఉన్నట్లు స్వామి సీతారాం గారికి పండిట్ నెహ్రూ వ్రాసిన లేఖవల్ల బోధపడుతుంది. ఆంధ్ర రాష్ట్రనిర్మాణానికి విభజనసంఘని వేదిక సహాయకారి కాగలదని నెహ్రూ వ్రాశారు. అయితే కొన్ని పరిష్కరింపబడని సమస్యలు, సందిగ్ధమైన నిర్ణయాలు ఉన్నవని కూడా నెహ్రూ వ్రాశారు.

పరిష్కరించబడవలసిన ఈ సమస్య లేవో, సందిగ్ధంగా ఉన్న నిర్ణయా లేవో ఆంధ్రనాయకులకు పండిట్ నెహ్రూ తెలిపి ఉంటారని అనుకోవచ్చును. ఇప్పుడు తెలిపిఉండకపోయినా, తరుణం

వచ్చినప్పుడైనా తప్పక తెలపగలరని భావించవచ్చును.

కాని ఈ సమస్యల పరిష్కారం విషయమై నెహ్రూ అవలంబించిన వైఖరి వల్ల కొన్ని కొత్త చిక్కులు ఉత్పన్నమౌతున్నాయని చెప్పక తప్పదు. ఏ పరిస్థితిలోనూ పరిష్కర్తను నియమించబోరని నెహ్రూ తెలియపరిచారు.

కాని ఏదోవిధమైన పరిష్కారవిధానాన్ని కేంద్రప్రభుత్వం అవలంబించకతప్పని పరిస్థితి ఏర్పడుతున్నది. రాయబారాల ద్వారా సర్వసమస్యలూ పరిష్కారం కావాలని నెహ్రూగారే అంగీకరించారు. అయినా పరిష్కర్త నియామకం జరగదని చెప్తున్నారు. సమాలోచనలద్వారా అన్ని సమస్యలూ పరిష్కారం కాక, పరిష్కర్త నియామకం అవసరమే వస్తే, పరిష్కర్తను నియమించే బదులు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్నే వాయిదా వేసెయ్యగలరని నెహ్రూ ప్రకటనలవల్లనూ, గతానుభవంవల్లనూ స్పష్టపడుతోంది. సరిగ్గా ఈ కారణంవల్లనే ఆంధ్రులపట్ల ఇతర భాషాప్రాంతాలవారు అన్యాయం చెయ్యడానికి వెనుదియ్యకుండా కృషిచెయ్యగలుగుతున్నారు.

మద్రాసునగరంవిషయమై ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ జె. వి. పి. రిపోర్టు బేషరతుగా అంగీకరించింది. తిరిగి ఆ సమస్యను ఎత్తినట్లయితే ఆంధ్రరాష్ట్రనిర్మాణం వాయిదా పడిపోవడమే కాక, మద్రాసులోని ఆంధ్రులు కష్టాలపాలు కాగలరు. ఆంధ్రులమధ్యనూ, తమిళులమధ్యనూ నెహ్రూ కోరుతున్నట్లు అన్యవిషయాలపైన సామరస్యం సాధించటం దుర్ఘటం కాగలదు.

ఇంక మద్రాసునగరసమస్యను మినహాయించగా రాష్ట్రవిభజన కార్యకలాపంలో అనేక పెద్ద సమస్యలుంటాయి. అవన్నీ ఆంధ్రులుతమిళులమధ్య ఒప్పందం కుదరడం సాధ్యంకాదు. సాధ్యమైనప్పటికీ, ఆంధ్రులు ఇప్పటికంటె మించిన త్యాగానికి సిద్ధపడవలసి ఉంటుంది. రాష్ట్రాన్ని కోరుతున్నది ఆంధ్రులే కాబట్టి, తమిళులు కారు కాబట్టి, ఆర్థిక ద్రవ్యాది వ్యవహారాలలో కొంత అన్యాయం జరిగినా ఆంధ్రులు తలొగ్గవలసిన పరిస్థితి రాగలదు. ఇది విభజనసంఘ నివేదికలోనే స్పష్టపడింది. తమిళులతో సఖ్యతకోసం విభజనసంఘ ప్రతిపాదనలకు ఆంధ్రులు అంగీకరించినా, ఆంధ్రులకు అన్యాయం జరిగిందని ఒప్పుకోక తప్పదు.

(46-వ పేజీ చూడండి)

# కౌంట్ ఆఫ్ మాంటే క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 65

ఆ రోజు రాత్రి డాంగ్లర్ ఇంటిలో తుపాను చెలరేగింది.

అప్పుడే లూషియన్ డిబ్రే హెర్మినా డాంగ్లర్‌తో కొంత సేపు మాట్లాడి వెళ్లిపోయాడు. డాంగ్లర్ రూక్షస్వరంతో భార్యను పిలిచాడు. అతను గది ప్రవేశించగానే భార్య అందుకుంది. "తమ కోపాన్ని చూపవలసింది ఇక్కడ కాదు. మీరు జీతమిచ్చి పోషించే మీ గుమాస్తాలపైన" అంది హెర్మినా డాంగ్లర్.

"అదెల్లాగ ? నాగుమాస్తాలు నీతిపరులు. నాకు ధనార్జనలో తోడ్పడతారు. నిజంగా వాళ్లు చేస్తున్న పనికి విలువ కట్టాలంటే నేనిచ్చే జీతం బొత్తిగా చాలదు. వాళ్ళపైన నేను కోపం తెచ్చుకోను. నాభాగ్యం పంచుకుంటూ నాకు నష్టం తెచ్చిపెట్టేవాళ్ళ మీదనే నాకు కోపం వస్తుంది."

"మీకు నష్టం తెచ్చిపెడుతున్న దెవరో చెప్పండి ?"

"నీకే తెలుసును. అయినా అడిగావు కాబట్టి చెప్తున్నాను. స్పానిష్ ఋణపత్రాలవల్ల నాకిప్పుడు అయిదులక్షలు నష్టం వచ్చింది."

"మీ కయిదులక్షలు నష్టం వస్తే అది నా తప్పా ?"

"లేకపోతే నా తప్పా ?"

"ఎవరితప్పైనా సరే ఇంక డబ్బుసంగతి మీరు నా దగ్గరెత్తవద్దు. నాకు మీడబ్బు మీదా, మీమీదా రోత కలుగుతోంది ?"

"ఇదేదో కొత్తవిషయం. ఇంతవరకూ నీకెందులోనైనా శ్రద్ధఉంటే అది నా డబ్బులోనూ, వ్యాపారంలోనూ అనుకుంటున్నానే. !"

"నాకా ? ఎందుకనుకుంటున్నారు ?"

"నిన్నుబట్టే !"

"అంటే ?"

"అంటేనా ? చెప్తా విను. ఏడాదికిందట ఒక వ్యాపారంలో నువ్వు నాకు సలహా ఇచ్చావు. అందులో పదిలక్షలు లాభంవస్తే, రెండున్నరలక్షలు నువ్వు తీసుకున్నావు. తీసుకుని ఎలా ఖర్చుపెట్టావ్ ? నేను నిన్నెప్పుడూ అడగలేదు. అది నీ స్వంతవిషయం కాబోలని ఊరుకున్నాను. ఈ సంవత్సరం వ్యాపారంలో వచ్చిన లాభంలో నీకు నీ వంతు అయిదులక్షలిచ్చాను."

"అయితే ?"

"ఆ తరవాత ఇప్పటికీ అంతా నష్టమే కాని లాభం రాలేదు. దీనికి నువ్వూ నీ సలహాలూ కారణమని నీకు తెలుసును. మూడురోజుల క్రిందట నువ్వు డిబ్రేతో రాజకీయాలేవో మాట్లాడావు. స్పెయిన్‌లో విప్లవం వచ్చిందని అతను చెప్పిన మాట నమ్మావు. దీంతో అయిదులక్షలు నష్టంవచ్చింది.

"అయితే ?"

"అయితే, లాభంలో పాతికవంతు పాలుతీసుకుంటున్నందుకు నువ్వు నష్టంలో కూడా పాతికవంతు భరించాలి."

"ఇలా చెప్పడానికి మీకు సిగ్గులేదా ? డిబ్రేకి మన వ్యాపారంలో ప్రమేయ మేముంది ?"

"ఏముందా ? ఈ సంవత్సరం వచ్చిన లాభంలో నీ వంతు అయిదులక్షలూ డిబ్రే తీసుకుపోవడం నేను చూశాను. అతనికి ఋణమే ఇచ్చావనుకో. మరెలాగైనా ఇచ్చావనుకో."

"ఛీ ! ఛీ !"

"ఛీత్కారాలవల్ల లాభంలేదు. కలహాలవల్లా తిట్లవల్లా వ్యాపారం సాగదు. డిబ్రే అదృష్టవంతుడు. వ్యాపారం చేయకుండా లాభంలో పాలుతీసుకుంటాడు. నష్టంలో అతనికి ప్రమేయం ఉండదు."

"ఇలా అనడానికి మీకు సిగ్గులేదా ?"

"ఎందుకు? నాలుగేళ్లనించి మనం భార్యాభర్తలుగా జీవించడం లేదు. వ్యాపారంలో వాటాదార్లుగామాత్రం గడుపుతున్నాం. మంత్రిగారి కార్యదర్శితో (డిబ్రే) రాజకీయాలు మాట్లాడాలని నీకు కోరిక పుట్టింది. అది వ్యాపారంకోసమని నాకు తెలుసును. నువ్వు అతనితో అంత స్నేహంగా ఉన్నా నాకు ఇబ్బంది లేదు—వ్యాపారం సరిగ్గా నడిచేవరకూ. మీ ప్రభుత్వానికి ప్రతికూలపక్షంలో చేరానని నా మీద అతను కుట్ర పన్నుతున్నాడేమో నాకెలా తెలుస్తుంది ? లేకపోతే స్పెయిన్‌లో విప్లవం వచ్చిందని లేనిపోని పుకారెందుకు పుట్టింది ? అది పట్టుకుని నాచేత స్పానిష్ ఋణపత్రాలన్నీ అమ్మించావు. ఈపుకారు బజారులో అందరికీ తెలిసిపోయింది. ధరలు పడిపోయాయి. నిజానికి నేను ఆ పత్రాల్ని అమ్మలేదు. ఊరికే దానం చేశానన్న మాట."

"ఆ పుకారు డిబ్రే కల్పించిందంటారు ? అది శుద్ధ అబద్ధం. టెలిగ్రాఫ్‌లో పనిచేసేవాడెవడో మోసంచేశాడు. వాణ్ని వుద్యోగంలో నించి తీశేశారు కూడా. అరెస్టు చేస్తారని భయపడి వాడు పారిపోయాడు. ఒక వేళ ఇది డిబ్రే పన్నాగమైతే ఆ సంగతి నన్నడగడ మెందుకు ? అతన్నే మీరు స్వయంగా అడగకూడదూ ?"

"ఆడవాళ్లు మగవాళ్లని ఇట్టే మోసగించవచ్చు ననుకుంటారు ! కాని అది నాదగ్గిర కాదు. ఏమీ ఎరగనట్లు పైపైకి నటించినా నాకు సర్వం తెలుసును. నీ మిత్రులు విల్‌ఫర్ట్, డిబ్రే మొదలైనవారందరినీ జాగ్రత్తగా కనిపెడుతూనే ఉన్నాను. నా దగ్గిరేదీ దాగదు. ఇదంతా చూసీ చూడనట్లు ఊరుకుంటున్నాను కాని నా వ్యాపారాన్ని నాశనం చెయ్యడానికి ప్రయత్నిస్తే మాత్రం ఊరుకునేది లేదు."

ఇంతవరకూ బెట్టుగా కలహం సాగించిన హెర్మినా విల్‌ఫర్ట్ పేరు వినగానే నిశ్చేష్టురాలైపోయింది. "విల్‌ఫర్ట్ ! విల్‌ఫర్ట్ !" అని మాత్రం అనగలిగింది.

"అవును. విల్‌ఫర్ట్‌మాటే నే చెప్పేది." అన్నాడు డాంగ్లర్ కఠినంగా. "నీ మొదటిభర్త అమాయకుడు. న్యాయాధికారివల్ల లబ్ధి లేకపోగా, అతని మైత్రివల్ల నువ్వు గర్భం ధరించినట్లు తెలుసుకుని, దుఃఖంతో, అవమానంతో వ్యధచెంది చివరికి ఆత్మహత్య చేసుకున్నాడు. ఆయన నీ ప్రాణాలు తియ్యకుండా తన ప్రాణాలనే ఎందుకు తీసుకున్నాడు ? ఆయన కింక జీవితంలో ఎలాటి ఆశా లేకపోవడంవల్ల. కాని నా స్థితి వేరు. నేను

అనువాదం: సీతారామ్

నా జీవితాన్ని ద్రవ్య వ్యాపారంకోసం వినియోగిస్తున్నాను. డిబ్రేవల్ల అయిదులక్షలు నష్టం వచ్చింది. ఇందులో పాతికవంతు అతన్ని భరించనీ. మీ ఇద్దరూ యథేచ్ఛంగా గడపవచ్చు."

హెర్మినా డాంగ్లర్ చేష్టలుడిగి కుర్చీకి అంటుకుపోయినట్లు కూర్చుండిపోయింది. డాంగ్లర్ గిరుక్కున తిరిగి వెళ్లిపోయాడు.

మరునాడుదయం డాంగ్లర్ తన భార్య ఎక్కడికో బయలుదేరడం చూశాడు. తరవాత తానొక బగ్గీలో బయలుదేరి శాంప్ ఎలిషీలో మాంట్‌క్రిస్టో ఇంటికి వెళ్లాడు. మాంట్‌క్రిస్టో ఇంటిలోనే ఉన్నాడు. కాని ఆ సమయానికి లోపల ఎవరితోనో మాట్లాడుతున్నాడు. డాంగ్లర్ సావడిలో కూర్చుని మాంట్‌క్రిస్టో రాకకై నిరీక్షిస్తున్నాడు. కొంతసేపటికి ఒక ఫాదరీ సావడిలోకి వచ్చి వెళ్లిపోయాడు. తరవాత మరికొంతసేపటికి మాంట్‌క్రిస్టో వచ్చాడు. "ఆలస్యమైనందుకు క్షమించాలి. బుసోనీతో మాట్లాడుతున్నందువల్ల జాప్యమయింది."

"అదేమీ ఫరవాలేదు లెండి" అన్నాడు డాంగ్లర్.

"బెంగపడి ఉన్నట్టున్నారేం? ద్రవ్యవ్యాపారం చేసేవారిలా ఉన్నారంటే తోకచుక్క చూసినట్లు అర్థం చేసుకోవాలనుకుంటాను."

"ఏం చెప్పను? చాలకాలంనించి నాతో వ్యాపారంచేస్తూ లక్షలకొద్దీ నా పేరుమీద నమ్మకంతో ఋణాలిచ్చి పుచ్చుకున్న పెద్దమనిషి ఇవాళ నాపేరు చెప్తే ధనం ఇవ్వనంటున్నాడు. ఆయన పేరు జకోపో."

"నిజంగా?"

"అవును. దీనికి తోడు స్పానిష్ ఋణపత్రాల నష్టం గురించి మీరు వినే ఉంటారు."

"అరె! చెయ్యి తిరిగిన మీరే ఇటువంటి పొరపాటెలా చేశారు?"

"అది నా భార్య పొరపాటు లెండి. స్పెయిన్‌లో విప్లవం వచ్చిందని కలకన్నది కాబోలు. నాకు అయిదులక్షలు నష్టం వచ్చింది మీరు వినలేదా?"

"ఏదో విన్నాను. కాని పూర్తిగా తెలియదు."

"విప్లవం వచ్చిందన్నవార్త టెలిగ్రాఫ్‌వల్ల వచ్చిందట. తరవాత టెలిగ్రాఫ్‌లో పనిచేసే మనిషి పరారైనాడు."

"అంటే ఈ మాసం మీకు అయిదులక్షలు నష్టమన్నమాట. ఇలా ఏడు మాసాలు జరిగిందనుకోండి. 35 లక్షలు నష్టం. అంటే మీపని ఆఖరేనన్నమాట. చెప్పండి మీ కేమన్నా ధనం కావాలా? అప్పివ్వమంటారా?"

"అప్పుడే తొందరపడకండి. ఇటువంటివి ఇదివరలో చాలా చూశాను కాని నేనెన్నడూ పరాజయం అంగీకరించలేదు. ఇప్పటికి నా పరిస్థితికి పోటీలేదు. నేను కూలిపోవాలంటే, ముందు మూడుప్రభుత్వాలు కూలిపోవాలి. ఇది సరేగాని కావల్కాంటీ మాటేమిటి?"

"ఏముంది, ఆయ నడిగిన సొమ్మివ్వండి."

"బాగుంది. ఇవాళ ఉదయమే మీ ఖర్చులో నాలుగులక్షలు తీసుకోవలసిందని బుసోనీ కావల్కాంటీకి ఒక పత్రం ఇచ్చారు. అదిచ్చాను. తరవాత ఆయన తన కొడుకుకోసం నా వ్యాపారంలో ఖాతా మొదలెట్టారు."

"కొడుక్కి ఎంత ఇస్తున్నాడు?"

"నెలకి అయిదువేలు. అయితే ఇంకా పైన కావలసివస్తే ఫరవా......."

"అహహ! ఇవ్వద్దు. పైన ఇస్తే తండ్రి జవాబుదారీ ఉండడు. వాళ్లందరూ పిసినిగొట్టులు."

"ఏం ఆయనకి రాబడి తగినంత లేదా?"

"లేకేం? ఆయన కోటీశ్వరుడే. కాని పైసా ఖర్చు కానివ్వడు."

"అయితే ఇటాలియన్లు విదేశాలవారితో పెళ్లిసంబంధాలు చేసుకుంటారా?"

చేసుకోరు. కాని కావల్కాంటీ సంగతి వేరు. అసలు కొడుకుని ఇక్కడికి ఇందుకోసమే పంపా డనుకుంటాను."

"బాగుంది. అయితే ఇక్కడ పెళ్లి చేసుకుంటే కొడుక్కి తండ్రి ఆస్తిలో ఎంటనే భాగమిస్తారా?"

"ఇష్టముంటే ఇస్తారు లేకపోతే లేదు. అయితే మీ అమ్మాయి నివ్వాలని చూస్తున్నారేం?"

"ఆలోచిస్తున్నాను.

"అయితే ఆండ్రీని ఆల్బర్ట్ బ్రతకనిస్తాడా అని నా కనుమానం."

"మరేం ఫరవాలేదు. మా అమ్మాయి తక్కువది కాదు."

"కాని ఆల్బర్ట్‌కి అంత భాగ్యం లేకపోయినా మంచి కుటుంబానికి చెందినవాడు."

"నాదగ్గర చెప్పకండి. ముప్ఫైఏళ్లనించి కౌంట్ మార్సెర్ఫ్‌కీ నాకూ స్నేహం. నేను గుమాస్తాగిరీలో ఉన్నప్పుడు అతను పల్లవాడు."

"అప్పుడాయన పేరు?"

"ఫెర్నాండో."

"అయితే ఆయన కొడుక్కి మీ అమ్మాయి నెలా ఇవ్వాలనుకున్నారు?"

"ఇద్దరం ఒకే స్థితిలోనించి వృద్ధిలోకి వచ్చినవాళ్లం. స్నేహితులం. అయితే అతని కున్న చెడ్డపేరు నాకు లేదులెండి."

"అవునవును. మీరు చెప్తుంటే నాకు జ్ఞాపకం వచ్చింది. గ్రీస్‌లో ఆలీపాషాతరఫున పనిచేసిన ఫెర్నాండోని గురించి ఏదో చెప్పుకోడం విన్నాను.

"అవును. అదే సంగతి. కాని ఏం జరిగిందో ఎవ్వరికీ తెలియదు. ఏం జరిగిందో తెలిస్తే ఎంత డబ్బైనా ఇస్తాను."

"దానికేముంది. గ్రీస్‌లో ఏజంటుకి ఉత్తరంవ్రాయండి. సులువుగా తెలుస్తుంది."

"అవును. తప్పకుండా వ్రాస్తాను."

"మీకు ఏదైనా తెలిస్తే..."

"మీకు తెలియపరుస్తాను."

"బాగుంది."

డాంగ్లర్ తృప్తిపడి లేచి చకచకా వెళ్లిపోయాడు.

---

## 63

హెర్మినా డాంగ్లర్ భర్తతో చెప్పకుండా ఆరోజు ఉదయమే బయలుదేరి విల్‌ఫర్ట్ కార్యాలయానికి వెళ్ళింది. అక్కడ ద్వారంవద్ద ఒక నౌకరు వేచిఉన్నాడు? "మీ కోసమే కదా న్యాయాధికారి నిరీక్షిస్తున్నారు?" అని అడిగాడు. "అవును" అని హెర్మినా సమాధాన మివ్వగానే, వెనకదోవ చూపి ఆమెను ఒక గదిలోకి తీసుకువెళ్లాడు. గదిలో విల్‌ఫర్ట్ కూర్చుని యోచిస్తున్నాడు. ఆమెవంక సూటిగా చూసి ఇలా అన్నాడు. "నీతో ఏకాంతంలో మాట్లాడి చాలాకాల మయింది" అన్నాడు. "తిరిగి ఇన్నాళ్లకి ఈ రీతిగా మనం కలుసుకోవలసి వచ్చింది. మన గత

(47-వ పేజీ చూడండి)

# ఫీములూ... పాములూ

శ్రీ భమిడిపాటి రామగోపాలం

నరసమ్మ రంగమ్మ
సీతారామమ్మ రామ్మూర్తిపంతులు
సూరమ్మ

నర : ఏమండోయి సీతారామమ్మగారూ! మిట్టమధ్యాహ్నంవేళ యిలా వొచ్చారు?

సీతా : చిన్నపనుండొచ్చేన్లెండి.

నర : కూచోండలాగ...... ఏమిటండీ భోగట్టాలు?

సీతా : భోగట్టా లేమిటండీ — నిన్నట్నించీ వొద్దామనుకుంటున్నాను. ఎక్కడా తీరుబడి దొరకడం లేదు...మన వడికి అన్నప్రాశన చేయిస్తారట. రాత్తిరికి మా పిల్లగారింటికి వెళదామనుకుంటున్నాము — ఇప్పుడే అంటూ ఉరుయింగిళ్లూ చేసుకొచ్చేను.

నర : డబ్బు కావాలి గాబోలు : చంపేశారే. యివాళే అంతా ఐపోయింది. ఇప్పుడిప్పుడు పట్టుకుపోయేడండీ ఆ తెలగావాడు — వాడి పెళ్ళాం ఖాయిలా పడ్డదిట. అమ్మా అమ్మా మీరే గతీ అన్నాడు. వున్న పాతికరూపాయిలూ తీసిచ్చేసేను.

సీతా : ఎవళ్లకీ యివ్వనని చెప్పేరు గదుటండీ!

నర : అలా యెందుకు చెప్తానమ్మా ఎవళ్లు ముందొచ్చి అడిగితే వాళ్లకే యిచ్చేస్తాను. నేనేం కూరొండుకోవాలా యేమిటీ డబ్బుంచుకుని? లేక మీ రడుగుతారని నాకు తెలుసుగనకనా?— పోనీ ఒక్కరగంటాగి రండి; ఆ లంకవాళ్ల చిన్నమ్మి తెస్తానంది యిస్తాను. మీకు వస్తువుమీద కావాలా అలీగానా?

సీతా : నాకు అప్పు ఏమీ అక్కర్లేదు. నేను దాచుకున్న ఆరు రూపాయిలూ చాలు.

నర : మీరు దాచుకున్న ఆరు రూపాయలూ ఏమిటీ?

సీతా : ఆవేళ దాచుకున్నాను గదుటండీ! — నా బొట్టు పెట్లోవి నాలుగు రూపాయలూ గోసెబస్తా మిగ్గిన రూపాయిలు రెండున్నూ! — మీదగ్గిర దాచమని ఇచ్చేను!

నర : మీరా? — నా దగ్గిరా? — దాచుకున్నారా?

సీతా : అదేమిటండీ అలా అంటారు? బొట్టుపెట్టిని పిల్లలు కంగాళీ చేస్తున్నారనీ ఆయన చూస్తే ఇంటికర్చుకని వాడేస్తారనీ చెప్పి దాచుకోమన్నాను గదుటండీ!

నర : అదెన్నాళ్ల కిందటండీ? నామతి మండిపోనూ!

సీతా : శ్రావణం భాద్రపదం ఆశ్వీజం వెళ్ళగా కార్తీకం: మూణ్ణెల్ల చిల్లరవుతోందండీ.

నర : .........

సీతా : కొంచెం జ్ఞాపకం తెచ్చుకోండమ్మా; బొట్టుపెట్లో అక్కడా అక్కడా కూడబెట్టివుంచిన నాలుగు రూపాయలూ దాచేను. పిల్ల వూరికే బొమ్మలపెళ్లిళ్లకనీ దానికనీ ఆ పెట్టి తీస్తూంది. దానికంటపడితే ఊగోల చేస్తుందని మీ కిచ్చి దాచమన్నాను. ఆవేళే గోసెసంచులమ్మి రెండు రూపాయలు తీసుకొచ్చి మీకిచ్చేను. ఏం? జ్ఞాపకం రావడం లేదూ?

నర : ఎక్కడండీ? నాబుఱ్ఱ బద్దలైపోనూ? జ్ఞాపకం వొచ్చి చావదేం?

సీతా : పోనీలెండి — అంతజ్ఞాపకం లేకపోతే యెలాగండీ? ఆవేళ మీ చేతికి నేను నాలుగురూపాయిలూ రెండ్రూపాయిల నోటూ యిచ్చేనమ్మా! కాస్త జ్ఞాపకం తెచ్చుకోండమ్మా?

నర : ఎక్కడ? బుఱ్ఱ పాతుకుందామన్నా జ్ఞాపకం రాదే! ఈమాత్రం సంగతి జ్ఞాపకం లేక పోతేయింత వొడ్డీ వ్యాపారం ఎలాచేస్తానండీ!—చిత్రంగా వుంది! మూణ్ణెల్లకిందటే యిచ్చేనంటున్నారు మరి. పోనీ ఏళ్లూ పూళ్ళూ అయిపోయిందా నేనంత మరిచిపోడానికి?

సీతా : కొంచెం ఆలోచించండమ్మా — ఏదో గొడవల్లో పడి మరిచిపోయుంటారు. ప్రమాణపూర్తిగా చెప్తున్నాను; నేను మీకావేళ ఆఱ్రూపాయలు దాచమని ఇచ్చేను. అబద్ధమైతే నా పిల్లలు తెల్లారేసరికి బుగ్గేసరి.

నర : అదేమిటండీ! ప్రమాణాలూ ప్రత్యక్షాలూ ఎందుకూ? నాదగ్గిర దాచుకోనీ వాళ్లెవరసలు?—పట్టుకుపోయే వాళ్లే గాని!—అందులో నాకు జ్ఞాపకం లేకపోవటమా? చిత్రంగా వుందండీ సీతారామమ్మగారూ? ఇన్నాళ్లై వొళ్లై వేపారం చేస్తున్నానా, యివాళ విన్నానండీ — నేనో సంగతి మరిచిపోయినట్టు!— ఒట్టు!—ఎప్పుడూ మరుపనేది లేదుసుమండీ! మరి మీ రెప్పుడిచ్చేరో — యేమిచ్చేరో — నాకసలు జ్ఞాపకమే లేదుసుమండీ!

సీతా : పోనీ లెండి. నేనే అబద్ధం ఆడివుంటాను కాబోలు.

నర : అబ్బెబ్బే! మీరబద్ధం ఆడతారని గాదు! ఛీ! ఇదేమిటమ్మా! మూణ్ణెల్ల వ్యవహారం జ్ఞాపకం వొచ్చి చావదూ! లేకపోతే ఇంతసేపాయి మీరడుగుతూంటే యిచ్చేనూ?

సీతా : పోనీలెండమ్మా తెలిసింది. బుద్ధిపొరపాటు బుఱ్ఱకెక్కింది. నాపనిప్పుడెలా అయిందంటే అలా అయింది. కన్నంలో తేలుకుడితే దొంగ ఏం చేస్తాడు మరి? పోతానమ్మా. చాలు.

నర : కోపమెందుకు సీతారామమ్మగారూ! మీరు నా దగ్గిర దాచుకో నుండరు. మరోరిదగ్గిర దాచుకున్నారేమో!

* * *

సూరమ్మ: ఏమిటండీ చేస్తున్నారండీ సీతారామమ్మగారూ?

సీతా : ఎవరు? మీరా సూరమ్మగారూ! రండి.

సూర : ఎమిటి చేస్తున్నారు? ఏదో గడబడగా అటూ యిటూ తిరుగుతున్నారు!

సీతా : ఏమీ లేదండీ! మా పెద్దపిల్లకొడుక్కి అన్నప్రాశనట రేపు బుధవారం నాడు. రాత్రికి పార్వతీపురం వెళ్లి తెల్లారి బండీ గట్టించుకుపోదామని అనుకుంటున్నాం. అంచేత సామాన్లూ అవీ సర్దుతున్నాను.

సూర : పార్వతీపురంలో ఎవరున్నారూ?

సీతా : మా తమ్ముడండీ!

సూర : సరేసరే. మరైతే యివాళ రామానుజకూటానికి రారా?

సీతా : ఏదీ? ఇంకా ఇవెంతసేప్పడతాయో!

సూర : రద్దురూ! ఓ పావుగంట కూచుని వొచ్చేతురుగాని. ఇవాళ కుంభకర్ణుడి యుద్ధం. రంగమ్మగారు మిమ్మల్ని పిలవమన్నారు.

సీతా : ఏం యుద్ధమోనమ్మా! ఇంకా మంచాలూ అవీ యీ గదిలో పేర్చి వాట్ల మీద పరుపులు పెట్టి గోనెపరదా పెట్టాలి. ఇదంతా ఓ గంటపని.

సూర : అయితే సరే వెళ్తాను.

సీతా : ఏమండోవ్! ఓ చిన్నమాట... పదిమందిలో అనుకుంటే ఏమౌతుందోగాని ఆ నరసమ్మగారు చూసేరండీ - యెంత దారుణం తలపెట్టారోను!

సూర : ఏమిటీ?

సీతా : ఆ రూపాయలు వాళ్లింటో దాచుకుంటే లేవు పొమ్మంది!

సూర : ఆ రూపాయలా? మీరు వాళ్లింటో దాచుకున్నారా?

సీతా : ఎరగరు టండీ? ఆవేళ అన్నట్టు మీకూ చెప్పేనుగదూ! పిల్లలు చూస్తే కంగాళీ చేస్తారని బొట్టుపెట్లో నాలుగు రూపాయలున్నా గోనిసంచులమ్మి రెండు రూపాయలున్నా నరసమ్మగారికి దాచమనిచ్చి మీతో చెప్పేనుగదూ! మీరూ మరిచిపోయేరా?

సూర : అవునండోయ్ - జ్ఞాపకమొచ్చింది. మీ యింట్లో ఎవరికీ తెలియకుండా వుండాలని గదూ!

సీతా : ఆఁ ఆఁ అదేనండీ, మొత్తం ఆ రూపాయలు దాచుకున్నాను; అది ఇవాళడిగితే లేదనేస్తున్నాది! చూశారా దారుణం!

సూర : అసలే లేదనేస్తోందా?

సీతా : అసలావిడకి జ్ఞాపకమే లేదుట - చూశారా! - పోనీ దార్లో పిల్లల కేమేనా కొని పెడదామనీ మనవడి చేతులో ఏమేనా పెడదామని అనుకుని అడిగితే అదంటోంది. నేను మామూలుగా అందరూ వచ్చినట్టే వొచ్చాననుకుంది గావోలు - వొస్తువుమీద కావాలా పోళీగానా అంటోంది చిత్రం!

సూర : ఆవిడకి జ్ఞాపకం లేదుగాబో లండీ; అందుకని అలా అడిగివుంటారు.

సీతా : పోనీ అంతదూరం రైల్లో వెళ్తారూ, ఓకానీ యిచ్చేనా ఏమీ కొనరు గదా ఆయన! పిల్లలు - ఎలా వుంటారు చెప్పండీ? - వెళ్లి అడిగేసరికల్లా నా దగ్గర దాచుకోవడమేమిటీ? ఆ రూపాయలేమిటీ? ఎప్పుడూ? యిలా మొదలెట్టింది. అఖరికి జ్ఞాపకమే లేదు పొమ్మంది.

సూర : పోనీ ఓ పని చేస్తారూ?

సీతా : ఏం చెయ్యమంటారూ?

సూర : మీ రొక్కమాటు ఆ రామానుజ కూటానికి రండి. ఆవిడ అక్కడే వుంది. నేను జ్ఞాపకం చేస్తాను. రంగమ్మగారి చేతకూడా చెప్పిస్తాను.

సీతా : ఇప్పుడు రమ్మంటారా?

సూర : రండి. ఇలా రద్దురూ! తరవాతే వొచ్చి సర్దుదురుగాని.

* * *

రంగమ్మ : వినండమ్మా తాత్పర్యం జెబుతున్నాడు: కుంభకర్ణుడు కొండని పట్టుకొచ్చి అమాంతంగా లక్ష్మణుడిమీదకి విసిరాట్ట. అతను - ఒక్క బాణంతో దాన్ని పిండి పిండి చేశాట్ట......

నర : అదుగో సూరమ్మగారూ సీతారామమ్మగారూ వొచ్చారు.

సూర : ఏమిటండీ నరసమ్మగారూ?

నర : ఆఁ ఏమీ లేదు. వొచ్చారనుకుంటున్నాం.

సూర : ఇవాళ మీరు చాలా నిబ్బరంగా వున్నట్టున్నారే! ఏమిటివాళ వంటలు?

నర : పెరట్లో టమాటాకాయలు దరిద్రుడి అప్పులా పెరిగిపోతూంటే కోసి పప్పుకూరొండుకున్నాం. నిన్న మంగళారంగదా, ఆంజనేయస్వామికి కొబ్బరికాయలు కొట్టి చిప్పలు పట్టుకొచ్చేరు. పచ్చడి చేశాను.

సూర : అబ్బోబ్బో! అందుకా అంత నిబ్బరం?

నర : ఆఁ - నిబ్బరమంటే అబ్బురమై పోయింది. రాత్తిరికి బియ్యంలేవు. యిమ్మని ఇదుగో తిరమలమ్మగా ర్నడుగుతున్నారు. మాకేలేవు, మొరుములున్నాయి. సొజ్జిపోసుకోవాలని చెప్తున్నాను. అలా వొచ్చేయి రోజులు. ఎప్పుడేనా యెరుగుదుటండీ?

సూర : పైకి చెప్పడానికి భయపడతాం గాని ఎవరింటో మాత్రం రెండుపూట్లా



అన్నం వొండుకుంటున్నాం! స్టోర్సులో గోధుమలైనా యివ్వండీ అంటే గోధుమ లేవు చోళ్లున్నాయని కబురు! మనం ఏం జేసుకుంటాం చెప్పండీ చోళ్లు? పోనీ ఏదేనా చేసిపెట్టినా పిల్లలు అంత దూరానికి విసిరికొడతారుగదా! - ఇలాంటి రోజుల్లో చల్దిఅన్నాలు కూడా పెత్తేగాని వూరుకోకుండా వున్నారు పిల్లలు.

సీతా : బియ్యం బ్లాక్‌మార్కెట్టులో రూపాయిపదణాలు పెడితేగాని సేరు లేవుట. అదైనా మన డబ్బా పావుసేరుతో రావు.

నర : సీతారామమ్మగా రేమిటో ఇవాళ దిగులుగా వున్నారు!

సీతా :.........

నర : ఇందాక నా దగ్గిరికొచ్చేరు పాపం-ఏమిటో ఆరురూపాయలు దాచుకున్నానంటారు. నా కెక్కడా బుర్ర బద్దలు కొట్టుకున్నా ఆ రూపాయ లేమిటో దాచుకోవడ మేమిటో జ్ఞాపకం రాదు. ఏమిటి సాధనం?

సీతా : నిజంగానే నే నిచ్చేనమ్మా. మీకు జ్ఞాపకం లేదుగావున్న. ఎవరొచ్చి అడిగినా యివ్వననీ, ఎప్పుడొచ్చి అడిగినా అవే అలాగే తీసిచ్చేస్తాననీ చెప్పారండీ.

నర : చిత్రం సుమండీ! ఇన్నాళ్లబట్టి ఇన్ని వ్యవహారాలు చూస్తున్నా నా, ఒక్కరు - ఇదుగోనండీ నరసమ్మగారూ, మీరు పలానాదమ్మిడీ లెఖ్ఖవెయ్యడం మరిచిపోయేరు-అనలేదు. ఇవాళ మీ రన్నారు.

సూర : నేనోమాట చెప్పనా నరసమ్మగారూ!

నర : చెప్పండీ యెంతమాట!

సూర : అవేళ, వాళ్లాయన చూస్తారేమో అనీ పిల్లలు ఖంగాళీచేస్తున్నారనీ బొట్టుపెట్లోవి నాలుగురూపాయిలున్నూ, గోనె సంచులు మూడు అమ్మగా వొచ్చిన రెండు రూపాయిలున్నూ మీ కిచ్చేరండీ. ఇచ్చి ఇలా వొచ్చి నాతో చెప్పారు. పాపం ఆవిడ అబద్ధమాడరు. మీరే కొంచెం ఆలోచించి జ్ఞాపకం తెచ్చుకోండి.

నర : సరి. ఆవిడ అబద్ధమాడుతారనా? నాకు జ్ఞాపకం లేని వ్యవహారం నేనుచెయ్యగలనా అని!

సూర : ఏమో; ఆపైన నాకూ తెలీదు. ఆవిడ మాత్రం ఆరురూపాయిలకోసం అబద్ధాలాడరని చెపుతున్నాను.

నర : సరే. అలాగయితే తెల్లవార్లేచి వెయ్యి వ్యవహారాలు చేస్తాను, వందలు వందలు వడ్డీలే పుచ్చుకుంటాను, నాకీ ఆ(రూపాయ లెందుకు జ్ఞాపకం లేవా అని నాయిది.

సీతా : పోనీ లెండమ్మా - తగువెందుకూ? నాఖర్మ. ఏదో దాస్తారు గదా అనిచ్చేను. పోనీ పిల్లల కేవేనా దార్లో కొనడానికి చంటివాడి చేతిలో ఏమేనా పెట్టడానికి వుంటా యనుకున్నాను. ఇలా ఐంది.

నర : తగువు కేముందీ? జ్ఞాపకం ఉంటే ఇవ్వ నటమ్మా? నాసొమ్ము మీరేం యిచ్చి మనడం లేదే!

సీతా : వొస్తా నమ్మా! ఆయ నీపాటికి కేకలు వేస్తుంటారు. సామాన్లు సర్దుకోవాలి.

రంగ : ఏమిటి? అప్పుడే, అర్ధఘడియేనా కూచోకుండా ఆవిడ అలా వెళ్లిపోయారేం?

సూర : సాయింకాలం వాళ్ల పిల్లగారింటికి వెళ్తున్నారుట; సామాన్లు సర్దుకోడానికి!

రంగ : రూపాయ లేమిటి?

నర : మూణ్ణెల్లకిందట తను నా దగ్గిర ఆరురూపాయిలు దాచుకున్నారట. నా కెక్కడా జ్ఞాపకం లేదు!

సూర : నరసమ్మగారూ! నేనో మాట చెపతాను వినండి. ఆవిడ ప్రయాణం ఖర్చుకీ వాటికీ పని కొస్తాయి ముందుమీరో ఆరురూపాయలు తీసిచ్చెయండి. తరవాత మీకు జ్ఞాపకం ఎలాగా వొస్తుంది; అప్పుడు ఊరుకుందురుగాని. మీకు జ్ఞాపకం రాదూ, మేం ఎలాగో ఆవిడ చేత యిప్పించేస్తాం.

రంగ : బాగుంది.

సూర : అదీనే చెప్పేది. ఆవిడ మీ దగ్గిర దాచుకున్నానంటూ అబద్ధం మాత్రం ఆడరు గదా? నామాట విని ముందో ఆ(రూపాయ లావిడ కిద్దురూ, అవసరం ఆవిడది పుణ్యం మీ దీని!

నర : పుణ్యమే స్లెండి. దగ్గిర డబ్బుం డొద్దూ? ఇవాళే ఆ తెలగావాడొచ్చి పాతికరూపాయలు పట్టుకు పోయేడు. లంక నారాయణ కూతురు తెస్తానంది తేలేదు. దగ్గిర చిల్లిగవ్వలేదు! ఇవ్వడమంటే చెప్పడం అంత సులభమా యేమిటే? వెళ్తున్నా.

రంగ : సరే. ఇవాళ బాగానే వుంది. తగువులు గదా ఎక్కడ జూసినా!

సూర : నరసమ్మగారు కఠినాత్మురాలు సుమండీ! నవ్వుతూ నవ్వుతూ చూసేరా ఎంతెంత మాటలందో పాపం!

* * *

సూర : నరసమ్మగారు కఠినాత్మురాలు సుమండీ! నవ్వుతూ నవ్వుతూనే చూసేరా, చల్లచల్లగా లేదని చెప్పేసింది!

సీతా : ఏం జేస్తాం, నా ఖర్మ! లేకపోతే యింట్లో చెదబట్టేయా చెడిపోయేయా! తీరికూచుని ఆ(రూపాయలూ మంటబెట్టుకున్నాను! ఏమిటో! అప్పటికా భయం పట్టుకుంది.

సూర : నేనూ రంగమ్మగారూ కొస్త కదిపించి చూసేం సుమండీ! లొంగింది గాదు!

సీతా : బండరాయండీ! అవి దెక్కడ లొంగుతుందీ? ఇదంతా నా ఖర్మ.

సూర : అనుకుంటేమాత్రం ప్రయోజనం ఏముంటుంది లెండి?

సీతా : దొంగతనంగా ఆయనకి తెలియకుండా దాచేద్దాం ఊడపాడి చేద్దాం అనుకున్నాను. దేముడు నాకు తగిన బుద్ధి చెప్పాడు.

సూర : అలా ఎందు కనుకోవాలెండి. ఆమాత్రం దాపరికం లేకండా ఏ యిల్లు మాత్రం వుంది? మీరేనా తినేద్దామనీ బట్ట కొనుక్కుందామనీ నగలు చేయించేసుకుందామనీ అనుకోలేదు గదా!

సీతా : ఆ! నగలు కూడాను!

సూర : ఓ కబురు చెప్తాను మరేం అనుకోకండి. పిల్లలకేదైనా కొనిపెట్టడానికీ మన వడి చేతులో పెట్టడానికీ వాటికీ పనికొస్తాయి. ఈ ఐదు రూపాయలూ వుంచండి. మళ్ళా నరసమ్మగారు మీకిస్తే యిచ్చేదురు గాని.

సీతా : ఆ! మరి ఆ సొమ్ము కళ్ళ జూసి నట్టే!

సూర : పోనీ అది గాకపోతే మీకు కలిగివున్నప్పు డిద్దురు గాని.

సీతా : ఎందుకు లెద్దురూ అనవుసరంగా అప్పు. ఇంతట్లో పిల్లలు చచ్చిపోర్లెండి.

(20-వ పేజీ చూడండి)

# గాలికబురు

**శ్రీ వీరుభొట్ల సత్యనారాయణమూర్తి**

★

## 1

చీకటి పడేసరికల్లా రావిచెట్టు దిబ్బమీద కూర్చుని, తీవిగా చుట్టపొగ పీలుస్తూ ప్రక్కనున్న రైతులు, కూలీలు, పాలికాపులు, స్నేహితులు మొదలైన వారితో కబుర్లు చెప్పుతూ, కిళ్ళీకొట్టు కొండయ్య కొపుతో వేళాకోళా లాడుతూ సరదాగా మాట్లాడే రంగయ్యబాబు ఆవేళ సాయంకాలం దిబ్బమీదకు రాకపోవడంతోనే అవూరి ఆసాములందరకూ నిజంగా ఆశ్చర్యం వేసింది. రాత్రి ఏడవడంతోటే కులాసగా చేతికర్ర ఆడించుకుంటూ కడుపునిండా భోంచేసి రావిచెట్టు దిబ్బ ప్రక్కనున్న కిళ్ళీకొట్టు చీడీమీద రంగయ్యబాబు కూర్చుని కబుర్లు చెప్పేసరికల్లా, నరిసిగాడు, చాకలి సూరయ్య, వెంకటేశ్వర్లు సిద్ధాంతిగారూ, మునసబుగారి మేనల్లుడూ, పాలికాపు సుబ్బన్న, సూరయ్య పెళ్లాం నీలాలూ, రంగయ్య పొలం కవులుకు పుచ్చుకొన్న నీలాద్రిరాజూ, బంగారీ కిరాణా కొట్టు అప్పల్రాజూ, ఇంకా అనేకమంది అక్కడ రంగయ్యబాబుతో కబుర్లు చెప్పతూంటే వారు.

ఆ పాలెం చాల చిన్నది. మొత్తం సుమారు ఓ వంద గడపుంటుంది. అందులో మునసబు సీతారామయ్యదీ, రంగయ్యదీ, పెంకుటిళ్లు. నరిసిగాడిదీ, సూరయ్యదీ తాటాకుకొంపలే. అవి వూరుకు ఓ అరమైలు దూరంలో వున్నాయి. అక్కడ పెద్ద చెరువుండడంచేత బట్టలు సులభంగా వుతుక్కోవచ్చునని సూరయ్యా, పంచముడు అవటంచేతనూ, అవూళ్లో వాళ్ల పొలాలు కాపలా కాయడంకోసం నరిసిగాడిని కూడ అక్కడే వుండమని రంగయ్యబాబు ఆజ్ఞాపించేడు.

అవూళ్ళో రంగయ్య చెప్పింది చెల్లుతుంది. అతను అవూరికి పెద్ద మునసబు సీతారామయ్యకూ, కరణం పేరిశాస్త్రికీ కూడ రంగయ్యమీద విశ్వాస గౌరవాలున్నాయి. కారణం ఏమిటంటే రంగయ్య చాల మంచివాడు. నెమ్మదస్తుడు. పేచీకోరు మనిషి కాడు. తన కున్నంతలో ఇంకొకరికి సాయం చెయ్యాలని చూస్తాడు కాని అపకారంమాత్రం చెయ్యడు. అంచేత పాలెంలోని ప్రజలంతా రంగయ్యని ఆ వూరికి పెద్దను చేసి ప్రతీ వ్యవహారం ఆయనచేతిమీదుగా పోనిస్తున్నారనడంలో ఆశ్చర్యం లేదు. వాళ్ళలో వాళ్ళకు తగాదాలు గాని వస్తే రంగయ్య తీర్పు చెప్పేవాడు. రంగయ్యమాట అక్షరాలా జరిగితీరేది. ఏ రైతుకేనా ఎప్పుడేనా పంటలో కాని మరే వ్యాపారంలో గాని నష్టం సంభవిస్తే అందరితోను చెప్పి వాళ్లచేత అతనికి సహాయం చేయించేవాడు. తనుకూడ శక్తి వంచన లేకుండా సాయం చేసేవాడు.

రంగయ్య పెంకుటింటిని అనుకొని ఒక పెద్ద తోటవుంది. అందులో అనేక కాయగూరలు, ఫలాలు, పుష్పాలు లభిస్తాయి. ఎవరికి కావలసినవి వారు ఆతోటలోనికి వెళ్లి నిర్భయంగా తీసుకోవచ్చు. ఏడాది క్రితం దిబ్బమీదనున్న రావిచెట్టుదగ్గర పెద్ద చీడీ ఒకటి కట్టించాడు. వేసవి కాలంలో ఆ చీడి రావిచెట్టు నీడవల్ల చల్లగా వుండి పడుకోడానికి, కూచోడానికి చక్కని ప్రదేశమయింది. కొండయ్య కిళ్లీకొట్టు పెట్టుకుంటానంటే ఆదిబ్బ ప్రక్కనే చీడీని అనుకొని ఒక బడ్డీ వేయించాడు. వూరిచివర ఆంజనేయస్వామిగుడికట్టించడం ఇప్పుడే పూర్తయింది. రేపొచ్చే అమ్మవారి సంబరానికి గుడి బాగుచేయిస్తానన్నాడు.

ఇన్ని వుపకారాలు చేస్తూన్న రంగయ్యబాబు ఆ సాయంత్రం దిబ్బదగ్గిరకు రాకపోవడంతోటే అక్కడి జనుల్లో ఆశ్చర్యం బయలుదేరింది. ఎంచేతంటే రంగయ్య ప్రతీ రాత్రి అక్కడికి వచ్చితీరేవాడు. ఆరు నూరైనా, నూరు ఆరైనా, అక్కడకు మాత్రం రావడం మానేవాడు కాడు. రంగయ్యమాటలు ఆ పల్లె ప్రజలకు అమృతోపమానములుగా నుండేవి. అసలుసంగతేమిటంటే ప్రస్తుతం రంగయ్యకి అరవయ్యోవపడి నడుస్తోంది. ఆరునెల్లనుండి ఒక విధమైన గుండెజబ్బని ఎవరో పట్నం నుంచి వచ్చిన డాక్టరు చెప్పేడట. అందుచేత రంగయ్యకు వంట్లో ఏమైనా అస్వస్థతగా నుందేమోనని అనుమానం తట్టింది.

"ఏరా నరిసీ మధ్యాహ్నం పశువుల్ని తోలుకు వెళ్లేటప్పుడు రంగయ్యబాబు యింట్లో వున్నారో లేదో చూసేవురా" అన్నాడు పేరిశాస్త్రి.

"మద్దేల పదకొండొంటికి గొడ్ల నిప్పకెళ్లేటప్పుడు బాబుగోరు అరుగుమీద కూకున్నారు బాబయ్యా—వెల్లావు సిక్కిపోతన్నాదని, బాగా మేపాలని సెప్పినారు. సిత్తంబాబయ్యా అని ఎల్లిపోనానండి. కూడుదిని ఇప్పుడొచ్చినాను. ఇకపైన నాకు దెల్దుబాబయ్యా' అవుల్ని, దూడల్ని, ఈయాల పొలంలోనే వుంచేసినాము" అన్నాడు నరసిగాడు అందరికేసి తిరిగి.

"నాల్గింటికి చుటలకోసం అప్పిని పంపలేదా కొండయ్యా"అని అడిగాడు మునసబు మేనల్లుడు రామారావు.

"లేదుబాబుగారూ" అప్పి పదింటికే చుట్టలట్టుకు పోనాది, అని కొండయ్య దిగాలుగా చూసేడు.

"అయితే రంగయ్యబాబుకు వంట్లో బాగులేకపోయినా వుండాలి. నేకపోతే నిన్నబాబు వచ్చేనావుండాలి. పదండి సూద్దాం ఎల్లి" అన్నాడు చాకలి సూరయ్య తన ఆలోచనకు మురిసిపోతూ.

"అవున్నా సూరీ అట్టాగే అవుద్ది." అంది సూరయ్య పెళ్లాం నీలాలు.

"అయితే అందరూ పదండి ఏమైనా ప్రమాదంగా వుంటే మంగులు పట్టకో

స్తాను" అన్నాడు వైద్యుడు పేరిశాస్త్రి. త్రోవలో వెంకటేశ్వర్లుసిద్ధాంతిపంచాంగం విప్పి వేళ్లు లెక్కపెట్టడం మొదలెట్టాడు రంగయ్యకు ఆరోజు మంచిదో కాదో చూడ్డానికి.

"రంగయ్యకు గుండె జబ్బటగా మనతో చెప్పేడుగాడేటి. కొంప తీయదుగదా" అన్నాడు బంగారిరాజు నీలాద్రితో. "ఒరేయ్ బంగారీ. ఇటు సూర్యుడటు పొడిచినా రంగయ్యబాబు జాతకం చెక్కుచెదరని జాతకంరా. పదేళ్లు గురుడు పన్నెండింట తాండవమాడుతూన్నాడు. నూట పదేళ్లు నిస్సంకోచంగా పిడిరాయిలా జీవిస్తారు" అన్నాడు సిద్ధాంతి పంచాంగం ముడుస్తూ.

"మా గొప్ప జోస్యం నేర్చుకున్నావు సిద్ధాంతీ. నీజోస్యం ఎప్పుడేనా నిజమయి ఏడిసిందీ" అన్నాడు పేరిశాస్త్రి ఈమధ్య సిద్ధాంతికూడ వైద్యం నేర్చుకుంటున్నాడనే ఉక్రోషంచేత.

మొత్తంమీద అందరూ కలసి రంగయ్యబాబింటికి కెళ్లారు. అప్పుడే గోడగడియారం ఎనిమిది కొట్టింది. వీళ్ళందర్నీ చూసేటప్పటికి రామలక్ష్మమ్మకు నిజంగా ఆశ్చర్యం వేసింది.

"ఎంగుకొచ్చేరు మీరంతా" అని అడిగింది తెల్లబోయి జూస్తు.

చిన్నబాబు రాలేదని, పోనీ ఆయింటికి చుట్టాలేనా రాలేదని వాళ్లు క్షణంలో గ్రహించారు.

"బాబున్నారా" అన్నారందరూ.

"అదేమిటి దిబ్బమీదకు రాలేదా" అంది రామమ్మ.

"రాలేదు తల్లీ. ప్రతీరోజు భోంచేసే కదూ వచ్చేవారూ—ఈవేళ ఎప్పుడూ దిబ్బమీదకు రావడం మానని బాబు రాకపోడంచేత ఏవూరేనా వెళ్లేరో లేక శరీరంలో సుస్తీగా వుందో కనుక్కుందామని వచ్చేము" అన్నాడు మునసబు సీతారామయ్య.

"ఆ... దిబ్బమీదకు రాలేదూ? మరెక్కడకు వెళ్లినట్టు? ఈమధ్య అన్నం సయించకపోవటంచేత అప్పుడప్పుడూ భోంచెయ్యకుండానే దిబ్బమీదకు వెళ్లుతూన్నారు. ఎప్పుడూ చెప్పకుండా వెళ్ళరే? ఎక్కడ కెళ్లేరో వెతకండి. వెతకండి" అని కంట తడి పెట్ట ప్రారంభించింది.

"ఊరుకో అమ్మా. బాబుగారిని మూడు నిముసాల్లో తీసుకొత్తా" అని పరిగెత్తేడు నరిసిగాడు.

సూరయ్య ఒకవైపూ, నరిసిగాడు ఒకవైపూ, నీలాద్రిరాజూ, బంగారీ ఒకవైపూ కర్రలు పుచ్చుకొని బయల్దేరారు రంగయ్యబాబుని వెదకటానికి.

"ఊరుకొండి రామలక్ష్మమ్మగారూ. బాబుగారిది ఇట్లాటట్లాంటిజాతకంకాదు. నూట పాతికేళ్లు ఇంద్రభోగం అనభవించే రాజాజాతకం అది... పదినిముషాల్లో రారూ.!" అన్నాడు వెంకటేశ్వర్లు సిద్ధాంతి.

"ఏదో మట్టిమశానం కల్పిచేసినా తన మందులూ మాకులూ పనికిరాకపోయేయే అని పేరిశాస్త్రి సిద్ధాంతికేసి చురచుర, చూశాడు.

రాత్రి పదిన్నరవుతోంది. మునసబు సీతారామయ్యా అతని మేనల్లుడు రామారావూ, సిద్ధాంతీ, రంగయ్యఅరుగుమీద రామమ్మని ఊరడిస్తూ కూర్చున్నారు. కునికిపాట్లు వస్తూండడంచేతనూ దొంగలభయంచేతనూ ఇంతవరకూ మాట్లాడకుండా నడుస్తున్న అప్పల్రాజు నెమ్మదిగా జారుకున్నాడు. దీపాలు, కర్రలు పట్టుకెళ్ళిన మనుష్యులు తిరిగి వచ్చారు. రంగయ్య జాడ మాత్రం కనిపించలేదు.

ఆ యింట్లో రంగయ్యా, రామలక్ష్మమ్మ ఇద్దరే వుంటున్నారు. వాళ్ళ పెద్దబ్బాయి నరసింహారావు కలకత్తాలో చదువుతున్నాడు. రంగయ్యబాబుమీద ఎంత అభిమానమో నరసింహారావు మీద అంతకు రెండింతలు ఆ వురివారికి అభిమానమని చెప్పాలి. పెద్ద చదువు చదువుతున్నాడని, పరీక్ష ప్యాసయి వచ్చి తమ వూరికి డాక్టరవుతాడని వాళ్ళఅభిప్రాయము. సెలవుల్లో పాలెంలోకి వచ్చినపుడల్లా అతను పట్నవాసం కబుర్లు చెప్తూంటే వాళ్ళు ఆనందంలో మునిగిపోతారు. ముద్దుగా అతనిని సిన్నబాబని పిలుస్తారు.

రంగయ్య జాడ కనిపించకపోయేటప్పటికి రామమ్మకి సోషొచ్చినంత పనయింది. అందరూ ఫరవాలేదని అనునయిస్తూ ఆమెను నిద్రపుచ్చారు. ఆ రాత్రి రామారావు, పేరిశాస్త్రి రంగయ్యగారి అరుగుమీదే పడుకున్నారు. ఎల్లాగో చచ్చి చెడి తెల్లవారింది.

* * *

ప్రొద్దున్న పది గంటలయినా రంగయ్యబాబు ఇంటికి రాకపోడంతోటే, రామారావూ, పేరిశాస్త్రి, రంగయ్యను వెదకటానికి సూరయ్యను, బంగారిరాజునూ, నీలాద్రినీ ప్రక్కవూళ్లోకి పంపించేరు. పొలాల్లో ఏ పామో, జెర్రో కరిచిందేమోననే అనుమానం మాత్రం సీతారామయ్యని పీక్కుతింటోంది. ఈ విషయం గాని రామలక్ష్మమ్మకు అనుమానంగా చెప్తే ఆవిడ గుండెపగిలి చస్తుంది. ఇప్పటికే ఆవిడ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని సంతతధారావృష్టిగా ఏడుస్తోంది.

అప్పికీ, నరిసిగాడికీ మాత్రం ఏ పొగాకు తోటలోనో ఏ పామో కాటేసిందని దృఢమైన నమ్మకం. ఊరవతల కొంపల దగ్గర కొచ్చి—

"ఒరే నరిసీ, బాబుకి ఏ పామో, జెర్రో రాత్రి కరిసుంటాది. లేకపోతే ఆ బాబు రాత్రి అట్టా ఇంటికిరాకుండా వుండిపోరు. ఈసంగతి అమ్మగారికి తెలిస్తే ఇంకేమన్నా వుందా" అంది అప్పి.

"నేనూ అదే అనుకొంటన్నా. తప్పకుండా బాబుకి ఏదో పెమాదం జరిగుంటాది. రాస్యంగా సిన్నబాబుకి కవురంపుతే రొండు రోజుల్లో ఎమానం మీద ఎగిరొత్తాడు. ఏటంటావు" అన్నాడు యజమానియెడలభక్తివిశ్వాసాలచేత కన్నీరుకారుస్తూ నరిసిగాడు.

"సరేగాని ఉత్తరం పడెయ్యాలిగా—కాని ఆయన ఎడ్రేసు మని కెట్టా దెలుస్తదీ అంట-అయినా ఆ ఇంగిలీసొచ్చినోళ్ళయూర్లో లేరుగందా-ఏటో గట్టిసిక్కొచ్చింది" అని మళ్ళీ తనలోతనే అనుకున్నాడు నరిసిగాడు.

"నరిసీ మునసబుగారి మేనల్లుడు ఏదో కళాసుపేసయినాట్టగా తెలుగులో ఉత్తరం రాయించేద్దాం. ఇంగ్లీషులో ఎడ్రేసు ఆయన రాస్తారేమో కనుక్కుందాం" అప్పి

చెప్పిన సలహా బావుండటంచేత నరిసిగాడు రామారావుగారింటి కెళ్ళిపోయాడు.

ఇంతవరకు ప్రక్కచేలో బట్టలారేస్తున్న నీలాలుకు ఈ మాటలన్నీ వినబడ్డాయి. పాపం రాత్రి సూరయ్య వొచ్చి రంగయ్య బాబు వెదికినా కనిపించటం లేదంటే ఏమో అనుకుంది. ఇంతవరకూ విషయం జరిగిందని దానికి తెలియనే లేదు. పాపం దాని గుండె చెరువయిపోయింది.

నరిసిగాడు, అప్పి మునసబు మేనల్లుడు రామారావుదగ్గర కెళ్లారు. రామారావు పదేళ్ళ క్రితం ఈ పాలెంకు పది మైళ్ళ దూరంలో వున్న ఓ బడిలో ఐదో క్లాసు ఫేలయినాడు. చిన్నబాబు యొక్క స్నేహంవల్ల కొన్ని ఇంగ్లీషుముక్కలు నేర్చుకున్నాడు గాని వ్రాయడం చిన్నతనంలోనే మర్చిపోయాడు. తెలుగు వ్రాయడం తెలుసన్నాడు. కాని తెలుగు వ్రాసేం పనికొస్తుంది. అంచేత ఈ విషయంలో అంతా నోరు మూసుకున్నారు. మధ్యాహ్నం పన్నెండయింది గాని రంగయ్య బాబింకా రాలేదు.

* * *

మధ్యాహ్నం భోంచేసి ప్రొద్దున్న ఎండేసిన బట్టలు మూటకట్టి నీలాలు కొత్తూరులోవున్న సెట్టిగారింటి కెళ్ళింది బట్టలిచ్చెయ్యడానికి. పాలెంకు కొత్తూరు మూడు మైళ్ళుంటుంది. కుంకుళ్ళు, పెసలు శనగపప్పు, నువ్వులనూనె మొదలైన సామానులన్నీ ఈ వూళ్లోనే దొరుకుతాయి. రంగయ్య ఎప్పుడూ బంగారిచేత ఈ సెట్టి దగ్గరే వస్తువులు తెప్పిస్తూంటాడు. బట్టలిచ్చేసి ఏవో కబుర్లలో నీలాలు ఆ మాట ఈ మాట అయాక

"సెట్టిగోరూ, నిన్న రాత్తిరినుండి రంగయ్య బాబుగోరు కనిపించటంలేదు బాబూ. నరిసిగాడూ, సూరయ్యా, నీలాద్రి రాజు వూరంతా ఎతుకుతున్నారు బాబూ. ఆయనెప్పుడూ సాయంత్రం నాలుగయితే ఇల్లు కదిలే మనిషి కాదు. పెసరుముక్కలు సూద్దామని ఎల్లేరుట మళ్లీ రాలేదు. ఏ పురుగో బుట్రో ఏమైనా సేసిందోనని నరిసిగాడికి పెద్ద అణుమానంగావుంది. ఆసంగతి సెప్పితే ఇంకేమన్నా వుందా. ఇప్పటికే అమ్మగోరి ఏడుపు సూళ్లేక పోతున్నాము. ఆ సిన్నబాబుకైన ఈ సంగతి చెప్పేవోళ్లెవరూ కాబట్టం నేదు. పాపంఅట్టాటిమారాజులు సల్లగుంట్లైనే వూళ్ళు సల్లగుంటయ్. ఏవిటో చకుంటున్నది బాబూ" అంది.

సెట్టికికూడా చాలా ఆశ్చర్యం వేసింది. ఆ సంగతి పూర్తిగా నీలాల్ని అడిగి తెల్సుకున్నాడు. సెట్టికి మాత్రం ఆయనకేపామో జెర్రో కరిచి వుంటుందని నమ్మకం బాగా నాటుకుపోయింది. సెట్టికి కొంచెం భయం కూడ వేసింది. ఎంచేతంటే ఈ మధ్య శ్రీరామనవమికి సంతర్పణలకి రంగయ్య ఓ రెండు మూడొందల సొమ్ము సామాను సెట్టి దగ్గరనుండి తీసికెళ్లాడు. ఓ రెండు నెలల్లో జమకట్టేస్తానన్నాడు. ఇప్పుడేమన్నా సంగతి జెడితే తన డబ్బేమవుతుందో అనే బెంగకూడ అతన్ని ఆవరించింది.

రాత్రి భార్యతో ఈ విషయం అంతా పూసగుచ్చినట్టు చెప్పేడు సెట్టి. సెట్టి భార్యకి మాత్రం చాల విచారం వేసింది. కారణమేమిటంటే రామలక్ష్మమ్మ బంగారి చేతికిచ్చి అప్పుడప్పుడు తనుచేసిన ఫలహారాలు పంపిస్తూండేది. చిన్నప్పుడు సెట్టి భార్య, రామలక్ష్మమ్మ కలసి చదువుకున్నారు.

నీళ్ళ బావి దగ్గర కొత్తూరులో నారాయణమ్మ సీతమ్మ, సింహాచలం వగైరా జనం అంతా సమకూడేరు. రామమ్మ నీళ్లబిందె చంక పెట్టుకొచ్చి

"ఏవమ్మ నారాయణమ్మ పాలెంలో రంగయ్యబాబుకు పాము కరచిందటగా" అంది.

"అయ్యో నాకెట్టా తెలుసమ్మా. అయ్యో పాపం. రెండు నెల్ల క్రితం మా ఆయన పట్నంలో బియ్యం కావలిసొస్తే ఆయన దగ్గరే కొనిపెట్టారు. చాలా మర్యాదస్తులని మా వారే చెప్పేరు" అంది నారాయణమ్మ.

"పాపం సిన్నబాబుతో చెప్పేవోళ్లే లేరట" అంది సెట్టి భార్య.

నీళ్లు తోడుకున్నాక అందరూ వెళ్ళిపోయారు.

ఈ సంగతంతా విన్న సింహాచలం కొత్తూరుకు నాలుమైళ్లు దూరంలో వున్న సైకిల్ షాపులో పనిచేస్తున్న తన భర్త అచ్చిరెడ్డితో చెప్పింది. రంగయ్య బాబు పొలాన్ని కవులుకు తీసుకున్న నీలాద్రి రాజు చెల్లెల్ని అచ్చిరెడ్డి తమ్ముడి కిచ్చి పెళ్ళి చేశారు. ఆ సందర్భంలో గనుక పాలెంకు వెళ్ళడం అక్కడ రంగయ్య బాబు తన స్వంతపనిలాగ పెళ్ళి వైభవోపేతంగా జరిపించడం అచ్చిరెడ్డి కళ్లారా చూశాడు. రంగయ్య బాబు యొక్క దయ, సౌహార్ద సమ్మిశ్రితమైన ఆతనిమాటలు తన భార్య సింహాచలంకు చెప్పేడు. అంచేత అచ్చిరెడ్డితో ఈ విషయం వెంటనే చెప్పింది సింహాచలం. పాపం ఇన్నాళ్లు పాలెంలో ఉండి కాస్త ఇంగ్లీషు

ముక్కలు చదివి పెట్టే పేరి శాస్త్రి కొడుకు రాజమండ్రి వెళ్ళి పోయాడని అచ్చిరెడ్డికి నిన్ననే రాజారావు చెప్పేడు.

అచ్చిరెడ్డి సైకిల్‌షాప్‌లో కూర్చుని వుండగా రాజమండ్రి పెళ్లికెళ్లుతున్న కొందరి బళ్లు కనిపించాయి. వెంటనే అచ్చిరెడ్డి చిన్నబాబుకో వుత్తరం వ్రాసేడు.

చిన్నిబాబూ,

మీ నాన్నగార్ని పాము కరచింది. చాల ప్రమాదస్థితిలో వున్నారు. మీరు వెంటనే రావాలి. నేను అచ్చిరెడ్డిని. పెళ్లిలో నన్ను చూసే వుంటారు.

పెళ్లివారిలో ప్రతీరోజు అచ్చిరెడ్డి సైకిల్ షాపు దగ్గర కాస్సేపు బీడీ కాలుస్తూ పట్నంలో సినిమాకబుర్లు గురించి ఉపారుగా చెప్తూ ఊరికే గాలికొట్టించుకొని పోయే అచ్చిరెడ్డి స్నేహితుడు రాజారావు కూడా పెళ్లివారింటికే వెడుతున్నాడు. స్కూలుఫైనలు ఫేలయిన రాజారావుకా వుత్తరంఇచ్చే డచ్చిరెడ్డి. ఏ క్లాసు చిన్నబాబు చదువుతున్నాడో వారికి తెలియదు. రాజమండ్రిలో కాలేజిపేరు కనుక్కొని వుత్తరం పోష్టుచెయ్యమని రాజారావుకా వుత్తరం ఇచ్చాడు అచ్చిరెడ్డి.

పెళ్లిఅయ్యాక పెళ్లివార్లో ఒక విధవావిడ కాశీప్రయాణం చేస్తోందని తెలియడంతోటే రాజారావు ఆ వుత్తరాన్ని ఆవిడ కలకత్తా ఎల్లాగ వెడుతుందిగనక్క అక్కడ కాలేజిపేరు ఎవర్నైనా అడిగి ఎడ్రసు రాయించి పోష్టుచెయ్యమని బతిమాలాడు. ఆవిడ ఒప్పుకుంది.

అనుకున్నట్లుగా కాక ఆమె కలకత్తాలో దిగకుండ ఏకాఏకీని కాశీ వెళ్లిపోయింది. ఎరుగున్న చుట్టాలింట్లో బసచేసింది. ఆ యింట్లోవున్న కాలేజీవిద్యార్థికి కంటబడిం దీకవరు. పైనవున్న నరసింహారావు పేరు చూడగానే తన ఫ్రెండ్ వుత్తరం ఈవిడ కెట్లా వచ్చిందా అని, ఆవిణ్ణడిగేటప్పటికి ఆవిడ సంగతంతా చెప్పింది. తను రేపే స్కూలుకు వెళ్లిపోతున్నానని తనిచ్చేస్తానని ఆ వుత్తరం పట్టుకెళ్ళాడు. తననోట్సులో ఆ కవరు పెట్టేడు.

కాని నరసింహారావును కలుసుకున్నా కవరుసంగతి మరిచే పోయాడు. ఒకరోజున కెమిష్ట్రీనోట్స్ తను వ్రాయకపోవడంచేత నరసింహారావు అతనినోట్సు అడగగానే తను కవరుపెట్టిన ఆ నోట్సు ఇచ్చే డతను.

ఉత్తరంలోని విశేషాలు చిన్నబాబు కళ్ళబడ్డాయి. అందులో అచ్చిరెడ్డి వ్రాయటంతోటే అతనికి మరీ ఆశ్చర్యం వేసింది. బాష్పాలు అప్రయత్నంగా కళ్ళనుండి జలజల రాలేయి. తండ్రి వద్దన్నా పరీక్షలయిపోయినా తను సెలవుల్లో కలకత్తాలోనే వుంటానని పట్టుబట్టి ఉండడం మరణావస్థలో ఆయన చరణసన్నిధిని ఉండకుండా చేయడానికే మోనని విలపించసాగేడు. వెంటనే పెట్టే బేడా సర్దుకుని రైలుస్టేషన్‌కు వెళ్ళిపోయాడు దడదడ కొట్టుకొంటున్న గుండెలతో—

## 2

పాలెం చేరుకోగానే మొట్టమొదట చిన్నబాబు పొలంలో రామారావుని చూచేడు. అతని హృదయం దడ దడలాడుతోంది. గట్టు మీదనున్న చిన్నబాబుని రామారావు నిమిషంలో గుర్తించేడు.

"ఏం పెళ్ళికొడుకుగారూ ఎప్పుడూ రావడం?" అన్నాడు రామారావు.

చిన్నబాబుకి నిలువెల్ల ఆశ్చర్యం వేసింది. ఈవింత పిలుపుకు అతని హృదయంలో పాతుకుపోయిన విషాదచ్ఛాయ లంతర్హితమయి పోయాయి. ఇంట్లో వారందరూ క్షేమంగా వున్నారని గ్రహించేశాడు.

"నాన్నగారికెల్లా వుంది?" అన్నాడు.

"అదేమిటి అల్లా అడుగుతున్నావు. పెళ్లిపనులు చేయించడంలో ఆయన నిమగ్నమయియుండి శుభలేఖలు పంచిపెట్టిస్తున్నారు."

రామారావు కబుర్లు నరసింహారావుకు పూర్తిగా అర్థం కాలేదు. తను ఆయన ఆరోగ్యం గురించి అడిగితే వీడు వివాహం గురించి వివరిస్తాడేమిటనుకున్నాడు. తన తండ్రి ఏ అపాయం లేకుండా క్షేమంగా వున్నందుకు మాత్రం చాల సంతోషించాడు. తన కొచ్చిన వుత్తరం గురించి మాత్రం అతని కేమీ పాలుపోటంలేదు. నీలాద్రి రాజింటిలోని వివాహంలో అచ్చిరెడ్డిని తను స్వయంగా చూసేడు. సహృదయుడు, గౌరవనీయుడు అయిన అచ్చిరెడ్డి ఇలా వుత్తరమెందుకు రాస్తాడని అతని మనస్సు ఘోషిస్తోంది. ఇహ అడిగేద్దామనుకున్నాడు.

"మా నాన్నకి పాము కరచిందటగా" అన్నాడు.

"ఇదేమిటి ? నీకెవరు చెప్పారు ఈ అబద్ధాన్ని ?

"నీలాద్రిరాజు ఇంట్లో పెళ్లికొచ్చిన అచ్చిరెడ్డి నెరగవూ ? అతను స్వయంగా నాకు వుత్తరం వ్రాసేడు నాన్నకు పాము కరచి ప్రమాదావస్థలో వున్నారని !"

రామారావు ఆలోచించాడు. అచ్చిరెడ్డియొక్క సద్గుణశీల సంపద గూర్చి అతను తెలియనివాడు కాడు. అలాటివాడు ఇల్లాటి వుత్తరం ఎందుకు రాస్తాడా అని ఆలోచింప మొదలు పెట్టాడు.

మూడు నెల్ల క్రితం రంగయ్య బాబు వూళ్లో కనిపించకపోవడం అప్పుడు ఏపామో, జెర్రో కరిచి ఉంటుందేమోనని అందరూ అనుమానించడం మొదలయిన ఘట్టాలు అతని స్మృతిపథంలోనికొచ్చాయి. అచ్చిరెడ్డి నిర్దోషి అనీ అతడు తుంటవ్యడనీ రామారావు తొందరగా గ్రహించగలిగాడు.

"ముందు ఇంటి కెడదాంరా పెళ్లికొడకా తర్వాత మీనాన్నే చెప్తాడు. షరేగాని పట్నంనుంచివచ్చిన ఆగోల్డుఫ్లేక్ పెట్టె ఇలా పడెయ్యరా. ఎన్నాళ్లూ ఈ పొగాకు చుట్టేనా" అన్నాడు రామారావు.

ఇద్దరూ నవ్వుకుంటూ ఇంటికి చేరుకున్నారు. రంగయ్య చూడగానే ఇద్దరు దగ్గర కెళ్లేరు. రామారావు కౌగిలించుకున్నాడు రంగయ్యని.

రాములత్కమ్మ పిల్లవాడు వచ్చేసినట్టు తెలియగానే ఆమె ఒక్కగంతేసి చిన్నబాబుమీద ప్రశ్నలవర్షం కురిపించేసింది.

పెళ్లిపందిర అడావుడి చూసేటప్పటికి నిజంగా చిన్నబాబుకి ఆశ్చర్యం వేసింది.

"ఏమిటి నాన్నా ఎవరికి పెళ్లి ?"

"నీకేరా నాయనా, కలకత్తా చదువుకెళ్లేటప్పుడు చెప్పేవుగా "నీమాటలెప్పుడూ జవదాటను. నా శ్రేయస్సు నీకన్నా ఇంకెవరికి కావాలి ? నీవేర్పాటుచేసిన పెండ్లికి అడ్డు చెప్పను. నేను పిల్లను చూడనవసరం లేదు. కాని నన్ను మాత్రం చదువుకు పంపడం మానెయ్యకు" అని, అవి జ్ఞాపకం వున్నాయా"

"నాన్నా నేను పెళ్ళికి సిద్ధమే. తీరా చదువు పూర్తిచేసుకొచ్చాక నీమాట తిరస్కరిస్తా ననుకున్నావా"

"నాకు తెలుసు చిట్టిబాబూ. అంచేతే ధైర్యంచేసి నాల్గురోజులు మాత్రమే వ్యవధి ఉండగా నీకు ఉత్తరం వ్రాయక నిన్న నే మన బంగారిని పంపించాను కలకత్తా"

"సరేగాని నాన్నా నీకు పాము కరచిందని అచ్చిరెడ్డి వుత్తరం వ్రాసేడు నాకు"

"అదేమిటి నాకెప్పుడు కరచిందిరా!"

రామారావు రంగయ్యకు రంగయ్య నాల్గురోజులు పొలంలో లేకపోవడంవల్ల జరిగిన గల్లంతు సంగతి జ్ఞాపకం చేశాడు.

రంగయ్య చెప్పడం మొదలెట్టాడు.

"ఆ వేళ పెసరమొక్కలు చూద్దామనుకుని వెళ్లేన్నా. రెండునెల్లక్రితం గుండె జబ్బని పట్నండాక్టరు చెప్పేడు. కాగా ఈ మధ్య వంట్లో ఏం బాగుంటంలేదు. పెసరుమొక్కలు చూస్తున్న టైములో మన జానకమ్మగారిపట్నంలేదూ మనకు పదిహేనుమైళ్లలో వుంది ? అది...ఆ పట్నం వాళ్లు. జానకమ్మకొడుకూ అతని స్నేహితుడూ గట్టుమీంచి కారెక్కి వెడతున్నారు. నన్నుచూడగానే కారాపేరు. నా దగ్గర కొచ్చి "మామా యీ వుర్లో ఈ వేళ మ్రదాస్ నించి గొప్ప పాటగత్తె లొచ్చారు. వస్తావా కారెక్కి దీసికెడ్తాం" అన్నాడురా జానకమ్మ కొడుకు సుబ్బారావు.

ఏదో నేను పాటలంటే చెవి తెగ్గోసుకుంటానని నీకు తెలుసుగా. కాగా పోనీ పట్టణం వెడుతున్నానుగా హాయిగా కారులోగదా. డాక్టరుకు చూపించుకో వచ్చు అనుకున్నాను. మన కిల్లీకొట్టు కొండయ్యగారింటికి ఆ వేళే చుట్టం ఒచ్చినాడు. పొలంలో ఆయనా వున్నారు. ఆయనతో చెప్పేను. "పట్నం వెడుతున్నానని, నాల్గురోజుల్లో వస్తాననీ ఇంటిదగ్గిర బెంగపెట్టుకోవద్దని చెప్మనీ" కాని ఆ ఆసామీ చెప్పడం మర్చిపోయి ఆ రాత్రే వాళ్ళవూరు వెళ్లిపోయాట్ట. సుబ్బారావుతో పిన్నిగారింటి కెళ్ళాను. ఎల్లాగానే జానకమ్మ అదృష్టంరా. రెండో పెళ్లి చేసుకున్నా మహాలక్ష్మిలా సుఖపడ్తోంది. ఏం మేడరా ! పైగా మొగుడు డాక్టరు. పాటకచ్చేరీలు అన్నీ అయినాక బావగారే డాక్టరు గనక సంతోషించి పరీక్షచేయించుకున్నాను.

"మాటయాభయ్యేళ్లు బ్రతుకుతావు రంగయ్యబావా. పిడిరాయిలా గున్నావు. ఏ చవట డాక్టరయ్య చెప్పింది ?" అన్నాడు.

పెళ్లయిన వెంటనే ఢిల్లీ వెళ్లిపోయారుగా వాళ్లు. అయినా అప్పుడే అమ్మని క్రింద పెట్టినంత పరిస్థితి రావడంచే మనం పెళ్ళికెళ్ళలేదు. జానకమ్మకు సవతికూతురుందిరా. స్కూలుఫైనల్ చదువుతోందిట. ఎంత మర్యాద ? ఎంత హోదా ? ఆ పిల్లని చూడగానే మనసు వెన్నముద్దలా కరగిపోయిందిరా. ఆ పిల్లని కోడల్ని చేసుకుంటే ఇల్లు కలకల్లాడుతుందని వెంటనే అడిగేశాను. నువ్వు డాక్టరుపరీక్ష రేపో మాపో ప్యాసవుతావు. ఆయన డాక్టరు. ఆవిడ కూడా డాక్టరమ్మవతుంది. మన ఇల్లు కలకల్లాడుతూ మనం ఈవూళ్ళో స్నేహంగా వుంటూ హాయిగా వుండొచ్చనుకున్నాను. ఆయన పరమానందభరితులై ఒప్పుకున్నారు.

రేపు బుధవారం పెళ్లి. అందరికీ శుభలేఖలు పంపించా, ఇదిగో ఆమె పటం"

రామారావు ఆపటం చూసేటప్పటికి భావాంబరవీధిలో తనూ తన నూతన ప్రేయసీ మహోల్లాసంతో నృత్యం చేస్తూన్నట్లనిపించింది. రంగయ్య, రామలక్ష్మమ్మ లోలోన నవ్వుకున్నారు.

రేపే పెళ్లి. వాతావరణం కలకల్లాడుతోంది. తలగడమీద పడుక్కుని ఆ పటం చూస్తూ ఊహాపథాల్లో భవిష్యద్రమ్య సౌధాలనిర్మిస్తున్నాడు నరసింహారావు.

అతని కొకదగ్గు వినిపించింది. వెనుదిరిగి చూశాడు.

"అరి భడవా పరీక్ష ప్యాసయి పెళ్లిచేసుకుంటూ మనకి కబురు పంపించకపోతే గాలికబురువల్ల విని గాలిలో కొట్టుకొచ్చి నువ్వు ప్యాసయ్యావన్న సంగతి పేపర్లో పడకుండానే కొట్టుకొచ్చి చెప్పేస్తున్నాము. ఏదీ సందెం, బహుమతి, నూరురూపాయలూ...?" అన్నాడు తన కలకత్తా స్నేహితుడు.

పరీక్ష ప్యాసయ్యావనగానే ఆనందంతో తన్మయుడయ్యాడు నరసింహారావు. బంగారి తీసుకొచ్చుంటాడని గ్రహించాడు.

"బహుమతి మాటేమిటిరా రేపు పెళ్ళి. మేనేజిమెంటంతా నీదేరా. చూస్తావుగా డబ్బు నీచేతిమీదుగా జరుగడ్తుంది" అన్నాడు నరసింహారావు.

స్నేహితుని దృష్టి పెళ్లికూతురు ఫోటోపై బడింది.

"అరి చవటా, ఏనాడైనా కాలేజీ గరల్‌తో మాట్లాడి ఎరుగుదువా కాళ్లు వణుక్కుండా. నాయనా చూసొక్క అబ్బాయి పని ఎడ్యుకేటెడ్ గర్లని చేసుకుంటున్నావు...."

"నరసింహారావు, తండ్రి పెళ్ళివారొచ్చారని చెప్పగానే ఊరుకోరా అని నవ్వేడు స్నేహితుడితో ముఖం చిట్లించుకుంటూ. అక్కడున్న వారందరూ గొల్లున నవ్వారు.

మర్నాడు పెళ్లి వైభవంగా జరిగిపోయింది. ★

# త్యాగం

హితులంతా గిండీ రేసెస్‌కి వెళ్లిపోయారు. అనంతం జేబులో పది రూపాయలకంటే ఎక్కువ లేదు. మొదటి తేదీ యింకా అయిదురోజుల దాకా రాదు. ఈ లోపల సిగరెట్లూ, కాఫీ వగైరా లన్నింటికీ నాన్న డబ్బు పంపే దాకా సరిపెట్టుకోవాలి. స్నేహబృందం పక్కన లేకపోవడంవల్ల అనంతానికి పిచ్చెక్కినట్టవుతోంది. నాలుగింటికి కాఫీ తాగి, సిగరెట్ ముట్టించి, మల్లెపువ్వులా తయారయి, ట్రిప్లికేన్ బస్ అందుకున్నాడు.

రూమ్‌మేట్సు యింటికొచ్చే దాకా తను ఎలాగో అలా కాలంగడపాలి. మనసు సినిమా కెళ్లమని తొందరజేసింది. సినిమా ఆరుంబావుకుగాని మొదలెట్టరు. ప్రస్తుతం టైమ్ నాలుగుంబావు—మరి మధ్య రెండు గంటలో....ఆలోచించాడు. సినిమా టైము దాకా బీచిలో గడిపి—ఆపైన సినిమా కెళ్లి—స్నేహితులింటికొచ్చే వేళకి తనూ చేరుకోవచ్చు గదికి.

అనంతం *F. L.* క్లాస్ చదువుతున్నాడు. మరీ అందగాడు కాదు, అందవికారీ కాడు. సామాన్యంగా వుంటాడు మనిషి. కాని హృదయంమటుకు ఏవో గొప్ప ఆదర్శాలతో, ప్రపంచంమీద సానుభూతితో తొణికిసలాడుతూ వుంటుంది.

అమ్మా నాన్న దగ్గిర వుండి గుంటూరులో *B. A.* పూర్తిచేశాడు. తర్వాత ప్రపంచానికి న్యాయం కూర్చాలనే తాపత్రయంతో న్యాయవాదిచదువుకు దిగాడు. మొదటి నుంచి పుష్కలంగా కాకపోయినా తన అవసరాలకి, విద్యకూ సరిపడే డబ్బున్న అనంతం దేశంలోని దారిద్ర్యం చూసి మహ విచారించేవాడు. తిండీ బట్టా లేని ప్రజలకు ఏదో తను సహాయం చెయ్యాలని ఆరాటపడేవాడు.

ఆ ఆరాటం పట్నం వచ్చాక మరీ ఎక్కువయింది. పేవ్‌మెంటుమీద వండుకుతిని జీవించే కుటుంబాలనీ, బస్‌స్టాండ్ల దగ్గిర అవిటివాళ్లని చూసి అతని హృదయం నిస్సహాయంగా ద్రవించేది. అందులో పట్నంలో వున్న వేలాది అనాథల్నీ చూస్తే అతనికి వూపిరిసలిపేదికాదు. యవ్వనంలో తనకి ప్రతి వస్తువా ఏదో సుందరంగా, కొత్త రంగుల్లో కనబడుతూంటే వాటిమీద నీడల్లా యీ బీదా బిక్కీ అతన్ని వెన్నాడుతూండేవి. వేడిరక్తం లేమిని తరిమెయ్యాలని రకరకాల ఆలోచనలకి పోయేది.

అలా అని అతను సినిమాలకీ, హోటళ్లకీ వెళ్లకుండా ప్రతికానీ బీదసాదలకి యిస్తున్నాడని అనుకోడం తెలివితక్కువ. కాఫీ హోటలు కెళ్లి—బయటకొచ్చి, కిళ్ళీనమిలి, సిగరెట్ ముట్టిస్తూండే వేళకి 'అయ్యా' అని చేజాపే దరిద్రులకి కానీ గాక అణా వేడ యిస్తూండే వాడు. అదే అతను చేసే ఘనకార్యం. అతని దయాదాక్షిణ్యాలు కానినుంచి బేడదాకా పెరిగాయి. దారిపక్కన దొర్లే బిచ్చగాణ్ణి సంస్కరిద్దామని వుండేది.

కాని ఎలా? ఏ విధంగా? మహానాయకులకే మార్గాలు తెలియనపుడు *F. L.* చదివే విద్యార్థికా?

బస్సెక్కి బీచిలో దిగాడు అనంతం. బీచంతా రంగు రంగుల చీరెల్తో తళుక్కున మెరుస్తోంది. బెలూనులు గాల్లో ఎగురుతున్నాయి. రేడియో సరిగమల్ని చెవుల్లోకి పంపుచేస్తోంది. వేరుగల్లువాళ్లు ఒకటే కేకలు. అనంతం పాంట్ జేబులో చేతులుంచుకుని ఫుట్‌పాత్ మీద నెమ్మదిగా అన్యమనస్కంగా నడుస్తున్నాడు.

నాలు గడుగులు వేశాక అతని కళ్లు దేనిమీదో క్షణం నిలిచాయి. దూరాన, అంటే మరీ దూరంగా కాదు, యిరవై గజాల దూరంలో ఒకమ్మాయి అలా సముద్రం వైపు చూస్తూ నుల్చుంది. ఆమె దృష్టి దేనిమీదా నిల్చి లేదు. జీవితపు శూన్యంలోనుంచి సముద్రపు శూన్యంలోకి చూస్తున్నట్లు వుంది.

ఆ అమ్మాయి అక్కడినుంచి కదిలి ఆ పక్కనే వున్న గారడి గుంపులో కలిసిపోయింది. అనంతం ఎందుకో అలా ఆ అమ్మాయిని వెంటాడుతూ గుంపుదగ్గిరకు చేరుకున్నాడు. ఈ సారి ఆ అమ్మాయి పది గజాలకంటె ఎక్కువ దూరంలో లేదు. అనంతం స్పష్టంగా ఆ అమ్మాయి ముఖాన్ని చూడగలిగాడు. ముఖంలో ఆకర్షణ లేదు సరిగదా, యవ్వనంలో కనిపించవలసిన అందం గూడా లేదు. ఒక విధంగా అందవిహీన అని చెప్పవచ్చు. నల్లని ముఖం, చిన్నకళ్లు, పెద్ద నోరు, ముక్కు అదిమినట్టుగా వుంది. పురుషుల్ని ఆకర్షించే ఏ కాస్త అందమూ లేని ముఖం చూస్తే అనంతానికి ఆసక్తి కల్గింది—ఆసక్తి కాదు జాలి కలిగింది.

కంపెనీ చీరె కాస్త మాసినట్టుగా వుంది. గట్టిగా బిగించి వేసిన జడకి చివర్న పసుపు పచ్చని మురికి రిబ్బను చూస్తే అనంతానికి చిరునవ్వు వొచ్చింది. చేతులో వెలిసిపోయిన పువ్వుల గొడుగు. గొడుగుపిడి విరిగిపోయింది. దానికి తాడు గట్టి గర్వంగా చేతులో పుచ్చుకుంది. వెలిసిన ఎర్ర జాకెట్టు మీద సూర్యరశ్మి పడడంవల్ల బూడిద రంగుగా కనిపించింది.

ఆ అమ్మాయి గుంపును వదిలి కిందికి చూస్తూ నడుస్తోంది. అనంతానికి ఆ పిల్ల మీద అపారమైన జాలిపుట్టుకొచ్చింది.

పాపం! యిరవై యిరవై రెండేళ్ల వయస్సులో గూడా ఏ పురుషహృదయాన్ని ఆకర్షించ లేకపోయి వుంటుంది. ఆ సాయంత్రం, స్త్రీ పురుషులు ఒకరొకరు రాచుకుంటూ, నవ్వుకుంటూ తిరిగే బీచిలో అనంతానికి, తనూ—ఆ అమ్మాయి—వారిద్దరే అలా ఏకాంతతతో తిరుగుతున్నట్టు అనిపించింది.

అతని హృదయంలో అణిగి మణిగి వున్న అహంభావం—ఆ పిల్లకి ఆ సాయంత్రం ఏదో ఆనందాన్ని చేకూర్చాలని నిశ్చయించుకుంది. తనలాటి విద్యావంతుడూ రూపసీ ఒక సాయంత్రం ఆమెకు వ్యక్తిత్వాన్ని యిచ్చి ఆదరించడం ఆ అమ్మాయి జీవితంలో మరుపురాని ఘట్టం అవదూ? సహరా ఎడారిలాంటి ఆమె జీవితంలో యీ సాయంత్రం ఒక ఒయాసిస్సు అవగల ఆనందంతను కూర్చాలి—అనుకుంటూ పెద్ద పెద్ద

అంగల్లో ఆ అమ్మాయి పక్కకెళ్ళి "నమస్తే" అన్నాడు అనంతం.

'ఆ' అంటూ తెల్లపోయి అతని వంక చూసింది ఆ పిల్ల.

'నమస్తే' అన్నాడు తిరిగి.

"యారు మీరు?" అంటూ తిరిగి నమస్కారం చెయ్యకుండా సూటిగా ప్రశ్నించింది.

ఆ ప్రశ్నలోని యాసకి అనంతం నవ్వుకున్నాడు. బహుశా ఏ కలవారింట్లోనో పనిమనిషేమో!—

"నేను— అనంతాన్ని బి. ఏ. పాస్ అయాను. మీరు వొంటిగా—" అంటూ నశిగాడు.

ఆ అమ్మాయి మాట్లాడకుండా నడక సాగించింది.

"మీతో ఎవరూ లేనట్టున్నారు. నేనూ ఒక్కడినే. అలా తిరిగి, కాంటీన్‌లో కాఫీ తాగి, ఖబుర్లాడుకుందాం."

అమ్మాయి ఖంగారుగా అతని వంక చూసి తడబడుతూ "కాఫీకి నా దగ్గర దుడ్డుయిల్లె- నేను రాను మీరు సాపడండి" అంది తల వంచుకు.

"మనిద్దరి కాఫీకి సరిపడ దుడ్డు నా దగ్గర వుంది. రండి వెళదాం. లేకపోతే ఆ మూల కూచుందాం. కొసేపుండి కాఫీ తాగొచ్చు."

"మీకు పణం నిండా వుందా? నా దగ్గర దుడ్డు లేదు. నన్ను కాఫీకి యారు ఎన్నడూ కూపడలేదు" అంది ఆశ్చర్యంగా.

"నేను పిలుస్తున్నా గా-రావూ" అన్నాడు మళ్ళీ అనంతం.

ఆ అమ్మాయి వెనక్కి తిరిగింది. బొడ్లోంచి నీలపు చేతిరుమాలుతీసి, ముఖం తుడుచుకుని నడుస్తో 'నన్ను యారు ఎప్ప కాఫికి కూపడల' అంది నెమ్మదిగా మళ్ళీ.



"నీ పేరు?"

"షణ్ముగం"

"ఏంజేస్తున్నావ్? పెండ్లయిందా?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

"కల్యాణం అవలేదు. తిరువత్తూర్ ఫాక్టరీలో వేల చేస్తున్నాను. రెండు వారాలకో తూరి దుడ్డు పుచ్చుకు పట్నంవచ్చి మళ్ళీ ఏడుమణికి తిరువత్తూర్ పూడుస్తాను" అంది.

"ప్రతి శని ఆదివారాలూ ఫాక్టరీకి శలవ యివ్వరూ?" అని ప్రశ్నించాడు.

"లీవు యిస్తారు కాని పట్నం రావడానికి దుడ్డు ఆపడదు. అందుకు మాసానికి రెండుతూరి మూడుమణికి వచ్చి—ఏడుమణికి మళ్ళీ పూడుస్తా" అంది షణ్ముగం.

ఇద్దరూ మెరినా కాంటీన్ దగ్గిరి కొచ్చారు. సాయంకాలపు నీరెండ సముద్రంలో ప్రతి బింబిస్తోంది. ఇందాకటి కంటే బీచిలో జన సందోహం ఎక్కువయింది. కాంటీన్‌లో రకరకాల మనుషులు. ముఖ్యంగా పట్టుచీరెలు—విలువైన సూట్లు. యివ్వన్నీ అనంతంకంటిని పడ్డాయి. ఎరుగున్న వాళ్లు కనపడతారేమో నన్న ఆదుర్దా కలిగింది అనంతానికి, గబుక్కున, తన స్నేహితులెవరన్నా, యీ బీదపిల్ల పక్కన, మెళ్ళో పూసలు కట్టుకున్న నల్ల పిల్ల పక్కన, తనను చూస్తే ఎంత అవమానం. నలుపక్కలా కలియజూశాడు— ఎవరూ ఎరుగున్న వాళ్లు కనపడలేదు.

షణ్ముగాన్ని వెంటతీసుకొని ఒక పక్కగా వున్న టేబుల్ దగ్గిర కూలబడ్డాడు హోటల్లో అందరికళ్లూ తనమీదే వున్నట్టుగా వుంది. ముచ్చెమటలు పోశాయి. నుల్చుని జేబులోంచి రుమాలు తీసుకోబోతున్నాడు. దూరాన అవతలకొసని శకుంతలా మాధవీ యిద్దరూ కూచుని వుండటంచూశాడు. అనంతం కాళ్లు వొణకడం మొదలు పెట్టాయి. వెయిటర్ వచ్చి టేబుల్ దగ్గిర నుల్చుని వున్నాడు.

"ఏంతింటావ్" అన్నాడు నెమ్మదిగా అనంతం.

"కాఫియేగా. అవల దుడ్డు లేదుగా" అంది షణ్ముగం గట్టిగా. వెయిటర్ వెకిలిగా నవ్వుతున్నాడు. అనంతానికి వాణ్ణి పట్టుకు తన్నాలని అనిపించింది. "రెండు ఐస్ క్రీమ్—చిప్స్" అన్నాడు విసురుగా వెయిటర్ వంక చూస్తూ. వాడు నిర్లక్ష్యంగా నవ్వి వెళ్లిపోయాడు.

అనంతానికి ముళ్లమీదున్నట్టుంది. దూరాన వున్న మాధవీ శకుంతలా ఎక్కడ చూస్తారో అని ఖంగారుగావుంది. షణ్ముగం

నిర్భయంగా, వాతావరణంలోని మార్పుల్ని గమనించనట్టు, పరిసరాల్లోని ధనాఢ్యుల్ని చూడనట్టు, హాయిగా కూచుంది. ఈ పట్టు చీరెలు, ఫాషన్లూ ఆ అమ్మాయిని అంటడం లేదా? లేక వాటి విలువ తెలియదా?

"నన్నెవ్వరూ ఎప్ప కాఫీకి కూపడ లేదు" అంటోంది తిరిగి షణ్ముగం. గొంతు పిసకాలనిపించింది. అనంతానికి. ఎప్పుడూ ఎవరూ పిలవకపోతేనేం? యివ్వాళ తను పిల్చాడుగా! నోరుమూసుకు కూచోరాదు! వెధవది లేనిపోనిది తెచ్చుకున్నాడు. మాధవీ శకుంతలా తనవైపే చూస్తున్నారు.— అదుగో నవ్వుకుంటున్నారు.

రేపు మాధవి క్లాసులో తలెత్తి చూస్తుందా? అనంతం కామన్ గరల్స్‌తో తిరుగుతున్నాడని శకుంతల నలుగురితో అనక మానుతుందా? తన గౌరవం, మాధవి మీద తన ఆశలు, ముందు ఈ నల్లపిల్లను వదుల్చుకుంటే...

వెయిటర్ నిర్లక్ష్యంగా చప్పుడుతో టేబుల్ మీద ఐస్ క్రీమ్ వగైరా పెట్టాడు. "వధవకి, వీడికెందుకు ఆ హేళన—ఎవర్ని తెస్తే ఏం, డబ్బివ్వడం లేదూ, వెధవఎగిరి పాటూ వీడూనూ—" "కాఫీ—బిల్లు" అన్నాడు విసురుగా అనంతం.

షణ్ముగం ఐస్ క్రీమ్ నోట్లో పెట్టుకుని "ఇంత జిల్లుమంది. నేనెప్పా సాపడలేదు" అంది ఉత్సాహంగా. ఆ మాటలనేటప్పటి కళ్లలోని తృప్తి, కొత్త వెలుగూ చూశాక అనంతానిక్కాస్తకోపం చల్లారింది. మాధవీ శకుంతలల కళ్లలో ఆ కృతజ్ఞతా, తృప్తీ తనులక్షలిచ్చయినా తెప్పించగలడా?

"మరోకప్పు తింటావా?" అన్నాడు దయగా.

"పల్లు పూడుస్తుంది-వాణా" అంది షణ్ముగం.

"కాఫీ యింకోకప్పా?" అన్నాడు మళ్లీ.

"వద్దు" అంది తలవూపుతూ.

"మళ్లీ ఎప్పుడో స్తావ్ యిక్కడికి?" అని ప్రశ్నించాడు.

"రెండోవారం పోనాక అంటే వొంబాదాం తేదిన మూడుం కాలుకి వస్తా-నాలు మణిదాక బస్సువద్దే నుల్చుకుంటా, మీరు వస్తారుగా" అంది నును సిగ్గుతో.

తను యిందాకటినుంచీ చూడని అందం ఆమె చెక్కిళ్లమీద కనపడింది అనంతానికి. "అల్లాగే, బస్సుదగ్గర ఎందుకు? యివ్వాళ టకీ మళ్లే నడుస్తాండు-కలుసుకుంటా" అన్నాడు చిప్స్ కొరుకుతూ.

వెయిటర్ కాఫీ తేవడంతో తలెత్తాడు. మళ్లీ శకుంతలా మాధవీలు-చుట్టూ సిల్కు చీరెలు, సూట్లూ మధ్య షణ్ముగం తనూ మాధవీ శకుంతలలు ఏవేవో గుసగుసలు చెప్పుకుంటున్నారు.

మళ్లీ తేళ్లూ జెర్రులూ పాకినట్టయింది. "అయిందా పోదాం. నువ్వింక వెళ్లు. నాకు పనుంది" అన్నాడు విసుగ్గా షణ్ముగంతో.

"ఇప్పుడు మణి అంజేగా-ఆరు మణిదాకా నాకు పనిలేదు" అంది షణ్ముగం.

"నాకు పని వుంది. నువ్వింక వెళ్లిపో." అన్నాడు లేని కాఠిన్యాన్ని కంఠంలోకి తెస్తూ.

షణ్ముగం రాళ్లని కరిగించేలా చూస్తూ "వొంబాదాం తేదీన నాలుమణికి కట్టాయం వస్తారా?" అంది దీనంగా.

ఆ కళ్లలోకి చూస్తుంటే షణ్ముగం వెంట వెళ్లి సాయంత్రందాకా వుండి, ఆ అమ్మాయిని బస్సెక్కించాలని అనిపించింది. కాని దూరానవున్న మాధవి గులాబీ జార్జిట్ చీరె శకుంతల నైల్‌పాలిష్, టేబుల్ మీద వారి ప్లాస్టిక్ బాగ్‌లు అన్నీ అతన్ని వెనక్కిలాగాయి.

"అల్లాగే" అన్నాడు కటువుగా.

"కట్టాయం" అంది బెరుగ్గా.

"కట్టాయం" అన్నాడు మృదువుగా.

షణ్ముగం వొంటిగా దీనంగా వంగిన బుజాలతో నిర్జీవంగా నడిచి వెళ్లిపోయింది.

నుదుటిమీద చిరుచెమటల్ని రుమాలుతో తుడుచుకుంటూ, మాధవీ శకుంతలల టేబుల్ వైపు నడిచి 'హల్లో' అన్నాడు హుషారుగా అనంతం. శకుంతల 'హల్లో' అంది తిరుగా నవ్వుతూ. మాధవి తను ఆ పక్క లేనట్టూ, తనకూ ఆ వచ్చిన మనిషికీ సంబంధం లేనట్టూ మొహం తిప్పుకుంది.

'అనుకున్నంతా అయింది' అని మనస్సులో అనుకుంటూ కుర్చీమీద కూలబడ్డాడు. అనంతం.

శకుంతల యీమాటా, ఆమాటా మాట్లాడింది. మాధవిని పలకరిద్దామని ప్రయత్నించి ఆమెదగ్గిరనుంచి సమాధానం రాక, వోడిపోయిన యోధుడిలా ముఖం పెట్టి కూచున్నాడు అనంతం.

"ఆ అమ్మాయి ఎవరూ?" అని గబుక్కున ప్రశ్నించింది మాధవి.

ఏం సమాధానం యివ్వాలో తెలీక, తికమకపడ్తున్న అనంతాన్ని సూటిగా చూస్తూ "మీ చెల్లెలా?" అంది మళ్లా మాధవి.

అనంతానికి మాధవిమీద అసహ్యం వేసింది. ఎంతయినా ఆ కూలిపిల్లను పట్టుకు 'నీ చెల్లెలా' అని అడుగుతుందా? తనంత లేనివాడనుకుందా? ఎంత చదువుకున్నా, ఎంతఅందమైనదైనా తననీవిధంగా మాటల్తో అవమాన పర్చక్కర్లేదు! 'అవును' అని అందామనుకున్నాడు. కాని యీ దెబ్బతో మాధవితో తెగతెంపులు చేసుకోవలసి వస్తుందని తమాయించుకుని "కాదు. బీచిలో కలుసుకున్నాను- ఎప్పుడో చిన్నప్పుడు తెలుసున్నమ్మాయి" అన్నాడు తడబడుతూ.

మాధవీ శకుంతలలకి తను షణ్ముగాన్ని ఏ పరిస్థితుల్లో పిల్చిందీ చెపితే అర్థం అవుతుందా? తను *impulsive* గా చేసింది వాళ్లకి బోధ పడుతుందా? తనది చంచల హృదయం కాదంటే మాధవినమ్ముతుందా? ఒకవేళ అన్నీ విని తనను వెర్రివెంగళప్ప కింద కడితే? తన మనస్తత్వాన్ని అర్థం చేసుకునే శక్తి మాధవికి వున్నదా? అయినా యిది సమయం కాదని, ప్రశ్నార్థకంగా చూసే ఆమె చూపుని తప్పించుకున్నాడు. అయితే మాధవి వూరుకుంటుందా? లేడి కళ్లతో అనంతం వంక తిరిగి "మళ్లీ వస్తుందా" అని అడిగింది.

అబద్ధాలకి అలవడని అనంతం సమాధానం వల్ల పడేచిక్కుల్ని వూహించక "తొమ్మిదో తేదీ శనివారం యీ వేళకే వస్తుంది" అని చెప్పాడు.

తను తెలుసుకోవలసిన విషయాలు పూర్తి అయినట్టు మాధవి శకుంతల వంక జూసి కళ్లెగరేసింది. ముగ్గురూ లేచారు. అనంతం బిల్లు చెల్లించాడు. "*Good-bye*" అన్నారు ఏకకంఠంతో అంద చందాల అబలలు.

* * *

"ఇంత వెకిలివాడని అనుకోలేదు." అంది మాధవి.

"అంటే?" అంది శకుంతల.

"ప్రతి అలగా జాతిపిల్లతో పోయేవాడని తెలుస్తే యింత దూరం అతనితో స్నేహం చేసి వుండకపోదును. ఛీ...ఆ పచ్చరిబ్బన్నూ అదీనూ-దానిలో ఏ అందం చూశాడో" అంది మాధవి.

"అతను చెప్పినట్టు చిన్నప్పటి ఏ పనివాళ్లపిల్లో అయివుండచ్చు. దానికింత రాద్ధాంతం ఎందుకు?"

"అది కాదు. మళ్లీ అది శనివారం వొస్తుందట చెప్పాడుగా. పనిపిల్ల అయితే యివ్వాళతో నే పోను. అతని మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నా. ఇంక రేపటినుంచి అతని ముఖం చూడను." అంది మాధవి నిష్కర్షగా.

"ఒక్క మాట చెప్తా విను. అనంతంలో నీకు యింతవరకు ఏ లోపాలూ కనపడలేదు అవునా?"

"ఊఁ..."

"ఈ ఒక్కటి అంటావా, దీని అంతూ వంతూ తేల్చుకుందాం. ఏదో తొందరబడి అతనితో తెగతెంపులు చేసుకోడం బాగుండదు. మీ రొమాన్సు కాలేజీ అంతా తెలుసాయెను. మీ వాళ్లకు కూడా మాచాయగా తెలుసు. అందువల్ల కొంత ఆలోచించి పని చేయడం మంచిది"

"ఏంపని?"

"నే చెప్పినట్టు చెయ్యి. రేపటినుంచి కాలేజీలో, బయటా అతనితో ముభావనగా వుండు. సాధ్యమైనంతవరకూ తప్పించుకు తిరుగు. అతన్ని క్రీగంట చూస్తూ, అతను నిన్ను చూడనట్టు నటించి—అంటె అతను చూస్తున్నప్పుడే—బాధగా భారంగా నిట్టూర్పులు విడు. నువ్వు మాట్లాడనందుకు కారణాలు అడిగేందుకు నిన్ను కలుసుగో చూస్తాడు కాని వంటరిగా మటుకు చిక్కకు. కాలేజీలో నేనెప్పుడూ నీ పక్కనే వుంటాను. యికి యింటిదగ్గిర అవకాశం యివ్వకు. వుత్తరాలు రాసినా ఎరగనట్టు వూరుకో"

"ఆపైన?"

"చెప్పేది విను. తొమ్మిదో తేదీ శనివారం ఆ పిల్ల వస్తుందని చెప్పాడా? శుక్రవారం సాయంత్రం అతనిదగ్గిరకెళ్లి శనివారం 'టీ' కి రమ్మనమని పిలువు. సరిగా మూడింటికని పిలు. అతని కళ్లలోకి దీనంగా 'రాను అని అనేందుకు వీల్లేకుండా' చూడు. సమాధానానికి ఎదురు చూడకుండా భారంగా వచ్చేయి. అప్పుడు తెలుస్తుంది అతని సత్తువ, అతనిమీద నీహక్కు ఎంతవరకు వుందో."

"ఎట్లా?"

"ఎట్లాగేమిటి! 'టీ'కి నీతో వచ్చాడంటే ఆ పిల్లను కలుసుకోడన్నమాట. అంటే నువ్వు ఆ అమ్మాయికంటే ఎక్కువన్నమాట. యిదే పరీక్ష. ఇందులో నువ్వు నెగ్గితే, అనంతం నీవాడు. నువ్వు వోడిపోయావా అతన్ని వొదిలేయవచ్చు—అంతేగాని యిప్పుడు తొందరబడకు. తెలిసిందా?" అంది శకుంతల మహాయుక్తిపరురాలులా.

మాధవి తల వూపింది.

* * * *

మాధవిని కలుసుకుని ఆనాటి పరిస్థితులు విడమర్చి చెపుదామని అనంతం శాయశక్తులా ప్రయత్నించాడు. శకుంతల సలహా తూచి తప్పకుండా పాటిస్తున్న మాధవి అనంతానికి అందలేదు. అతని వుత్తరాలు బుట్టదాఖలా అయాయి. మాధవి తనవల్ల చాలా బాధపడుతోందని గ్రహించాడు. ఆమెను వోదార్చి, లాలించాలని అనుకున్నాడు కాని...

శుక్రవారం మాధవి శకుంతలలు గేటు దగ్గిర తచ్చాడుతూ అనంతానికి కనపడ్డారు. ఇన్నాళ్లు మాధవికోసం తను కాసుకువుండేటంగాని, మాధవి తనకోసం వుండ లేదు. బహుశా తన వుత్తరాలు పని చేశాయేమో ఆమె కోపం పోయిందేమో!

మాధవి తనవైపుగా వచ్చి దీనంగా ముఖం పెట్టి "రేపు మూడింటికి మాయింటికి 'టీ' కి రండి-మీతో మాట్లాడాలి" అంది నేలను చూస్తు.

మాధవి రాజీలోకి దిగుతోందా? "నిరభ్యంతరంగా వస్తా" అని అతి సంతోషంతో అనబోయాడు కాని వెంటనే షణ్ముగం జ్ఞాపకం వచ్చింది. పాపం! తనకోసం బీచి దగ్గిర కాసుకుని వుంటుంది. పోనీ ఎల్లుండి మాధవి యింటికెళ్తే? రాలేనని అంటే?

మాధవి తలెత్తి అతనివంక చూసింది. నీలి మబ్బులవంటి ఆవిడ కళ్ళు తననికట్టేశాయి. నుదుటిమీద స్వేదబిందువులు అతని హృదయాన్ని కదిపేశాయి. పాపం! పిచ్చి మాధవి తనకోసం బాధపడ్తోంది-రానని ఎలా అనడం?

"ఊఁ" అన్నాడు.

మారు మాటాడకుండా వెళ్లిపోయింది మాధవి.

* * *

మర్నాడు టీ, తాగాక మాధవి 'అలా తిరిగివద్దాం' అంది అనంతం శకుంతలలతో.

అనంతానికి నిన్న సాయంత్రం మాధవి మీద వున్న జాలి యీ సాయంత్రానికి సగం తగ్గింది. నిన్న మాధవి నిస్సహాయంగా కనపడిందిగాని, యివాళ ఏదో గర్వంగా ప్రవర్తిస్తున్నట్టనిపించింది అతనికి. చక్కగా నేర్పుగా సింగారించుకున్న మాధవివెనక లీలగా షణ్ముగం మాటిమాటికి అనంతానికి జ్ఞాపకం వస్తోంది. అతని హృదయం షణ్ముగాన్ని కలుసుకోలేకపోయినందుకు కలవరపడసాగింది.

ముగ్గురూ లేచారు. ట్రిప్లికేన్ బస్ ఆగింది. 'ఎక్కుదాం' అంది మాధవి. శకుంతల రెండడుగులు వేసింది. అనంతం ఎవరో ఆపినట్టు ఆగిపోయాడు. మళ్లీ కాంటీన్‌కా? అక్కడికి కావాలని ప్రయాణం చేయిస్తోందా మాధవి?

నిన్నటినుంచీ కలగని అనుమానం క్షణంలో మెరిసింది. కాని వెనక్కి తగ్గడం యిప్పుడు అనాలోచితం.

ముగ్గురూ బస్సు దిగారు. కాసేపు యిటూ అటూ తిరిగాక, మాధవి కాంటీన్ వైపు అడుగు వేస్తూ "మీ యిద్దరికీ నేను పార్టీ యిస్తా" అంది వోరగా నవ్వుతూ. అనంతం అనుమానాలు దృఢమయాయి.

ముగ్గురూ మధ్యటేబుల్ దగ్గిర కూచున్నారు. మాధవి ఏవేవో లిస్టు చెబుతోంది. అనంతానికి ఏమీ వినపడటంలేదు. శకుంతల దేనికోసమో వెతుకుతున్నట్టు చూస్తోంది.

ఐస్‌క్రీమ్ తింటూ ముగ్గురూ మాట్లాడుకుంటున్నారు. అనంతానికి షణ్ముగం 'జిల్లుమంది' అనటం జ్ఞాపకం వచ్చింది. 'పాపం' అనుకున్నాడు.

మాధవి తలెత్తి "అదిగో మీ ఫ్రెండు" అంది అనంతాన్ని వుద్దేశించి.

దూరాన షణ్ముగం వుత్సాహంగా తనవైపు వస్తోంది. అనంతం లేవలేదు. అలా చూస్తూ కూచున్నాడు. పది అడుగులు ముందుకువచ్చి ఆగిపోయింది షణ్ముగం. ఆ ముఖంలో నవ్వు లేదు. శూన్యంలోకి చూస్తున్నట్లు కూచున్నాడు అనంతం.

మరో నాలుగడుగులు ముందుకువచ్చి అతనివంక తేరిపార చూసింది. ఆ కళ్లలో దెబ్బతిన్న లేడికళ్ళలోని బాధ వ్యక్తమ

యింది. గుండెల్లో ముల్లు గుచ్చుకుంది. అనంతం అలాగే చూస్తూ కూచున్నాడు.

షణ్ముగం గిర్రున తిరిగి నెమ్మదిగా దూరానికి వెళ్ళిపోయింది. మాధవీ శకుంతలలు షణ్ముగం వేసుకున్న పచ్చరిబ్బను చూసి బిగ్గరగా మరీ బిగ్గరగా నవ్వుతున్నారు. తళుకు బెళుకుల నాగరికత మానవ హృదయాన్ని చూసి వికృతంగా నవ్వే నవ్వు అది.

ఆనాటినుంచి మాధవిమీద ఒకవిధమైన అసహ్యం కలిగింది అనంతానికి. నీలాల వంటి ఆ కళ్ళలోకి చూసినప్పుడు దెబ్బతిన్న షణ్ముగంకళ్లు జ్ఞాపకం వచ్చేవి. మాధవిని ప్రేమిద్దామని ప్రయత్నించాడు. కాని వారిద్దరిమధ్యా షణ్ముగం భంగపాటు అడ్డమొచ్చింది.

ఆనాటినుంచి మాధవినే కాదు, ఏ స్త్రీ కళ్ళలోకి ప్రేమతో చూడబోయినా, షణ్ముగంచూపు వెంటాడేది అనంతాన్ని. అంతే అతను ఏ స్త్రీనీ ప్రేమించలేకపోయాడు. ఆ సాయంత్రం తను అనాలోచితంగా జాలిపడి అలా ఎందుకు ప్రవర్తించానా—అని ఎప్పుడూ విచారిస్తూనే వుంటాడు. ఆ సాయంత్రపు దుర్బలత్వాన్ని నిందించుకోని రోజు లేదు అతని జీవితంలో.



## చీములు - పాములు

(10-వ పేజీ తరువాయి)

సూర: అలాంటి మాట్లనకండి. ఉండండి. ఎందుకేనా పనికొస్తాయి చేకొవు. అదుగో మీవారు వొస్తున్నారు నే పోతాను.

రామ్మూర్తి పంతులు: ఏమిటే? నువ్వు పురాణం నరసమ్మగారి దగ్గిర ఆ రూపాయలు దాచుకోడ మేమిటే?

సీతా: ఏం లేదు.

రామ్మూ: నాకంతా తెలిసిందిలే.

సీతా:...మూణ్ణెల్ల కిందట నేను అక్కడా అక్కడా దాచిన నాలుగు రూపాయలూ ఆవేళే గోనెసంచు లమ్మి ఓరెండు రూపాయలూ దాచమనిస్తే లేదనేస్తోందండీ. నాఖర్మ!

రామ్మూ: ఖర్మేమిటి? చేతులారా చేసుకుని! ఇంట్లో వుంటే ఏమయ్యేయి జెప్పూ, చెడిపోతాయనా చెదపడతాయనా వాళ్లకిచ్చేవు?

సీతా: నాకు జ్ఞాపకం లేదు పొమ్మంటోంది! అక్కడికి సూరమ్మగారూ రంగమ్మగారూ కదిపి చూసేరుట సుమండీ!

రామ్మూ: ఏడవ లేకపోయినారు! దొంగతనంగా నాకు తెలీకుండా ఏదో దాచేద్దాం ఊడపొడిచేద్దాం అనుకున్నావు! తగిన శాస్తయింది!

సీతా: బాగుంది. నేనేనా తినేద్దామనీ బట్టగొందామనీ నగలు చేయించుకోవాలనీ దాచలేదు. పిల్లలకోసమే!

రామ్మూ: నగలు! నగలుకావొద్దూ! పిల్లలకోసమేంట! దుబారా ఖర్చుకోస మనరాదూ! అదెవరక్కడ? నరసమ్మగార్లా వుంది!

నర: అవునండీ నేనే. ఇలా రండి సీతారామమ్మ గారూ!

రామ్మూ: మీరే రండి లాగ!

నర: ఇందాకఅడిగేరు చూసేరూఅమ్మా—నాకు బొత్తిగా జ్ఞాపకం లేకగాని ఉంటే వెంటనే యిచ్చేద్దునమ్మా. ఇప్పుడు మా ఆచార్లుగా రొచ్చేరు. ఆయన్నడిగేను శ్రావణమాసంలో మీకేమేనా పద్దుందేమో చూడమని. ఆయన తీసి చూస్తే ఆవేళ సాయంకాలం నేను చెప్పేనుట ఆ రూపాయలు మీరిచ్చినట్టు. పుస్తకంలో రాసినా, అవుసరానికి మీకివ్వాలి గదా అని ఆరూపాయలే, ఆ రెండ్రూపాయల నోటే పొట్లాం కట్టి సందుగుపెట్టి అడుగరలో పడేశార్ట. ఇదుగో చూసుకోండి.

సీతా: ఎంత బావుందమ్మా - ఇదుగో, ఆ వేరూపాయలూ అదె నోటున్నూ!

నర: మరేం అనుకోకండమ్మా. నే పోతాను. సొమ్ము జాగర్త. ఇచ్చేసేనుడీసుమం!

సీతా: అలాగే అలాగే.

రామ్మూ: ఇలాతే.

సీతా: అబ్బ! ఏం బాగా వుందీ!

రామ్మూ: మరి తమాషా చెయ్యక ఇలాతే. కావాలి.

సీతా: నాకూ కావాలి.

రామ్మూ: కావాలన్నప్పుడిలా యిచ్చేయి. అంతే.

సీతా: అదేమిటండీ ఆదమాయింపూ?

రామ్మూ: దమాయింపేమిటి ఇలా యియ్యి ముందర. నువ్వు పెట్టినా ఆకర్చే నేను పెట్టినా ఆకర్చేగద!

సీతా: అదే బావుంది. ఇంతా కష్టపడి నేను జాగర్త చేస్తే...

రామ్మూ: ఓ! మహా కష్టపడ్డావు. దొంగలెఖ్ఖలువేసి దొంగబాకీలు అప్పజెప్పిన్నీ!

సీతా: అలా ఎవరూ చెప్పలేదు.

రామ్మూ: గోనెసంచు లమ్మడం బాగానే వుంది. మరి వాట్ని తెచ్చింది నేనేగద!

సీతా: అయితేమాత్రం? వొంటిమీది బంగారంమీదెగదా అని తీసి కర్చుపెట్టేస్తారా యేమిటి?

రామ్మూ: బంగారం వేరు, డబ్బు వేరు.

సీతా: వేరే, పాపం!

రామ్మూ: నీతో నాకు వాద నెందుకు? తే యిలాగ!

సీతా: తీసుకోండి అంతకోపం అయితే.

రామ్మూ: అలాగే తీసుకుంటాన్లే...ఆ చేతులో ఆ అయిదురూపాయల నోటేమిటి?

సీతా: అది వేరు.

రామ్మూ: ఆ వేరేమిటీ అంట! నువ్విలా ప్రతీదానికీ వేలుమీద గోరు మొలిచిందంటూ వుంటే యెలాగ?

సీతా: అంత వేరుకాదు. నరసమ్మగారు 'ఇవ్వరనుకొని నేను యిదవుతూ వుంటే సూరమ్మగారు పట్టుకొచ్చిచ్చేరు.

రామ్మూ: ఇవి ఆవిడదగ్గిర దాచిన బాపతన్నమాట!

సీతా: దాచడ మెక్కడ? అప్పిచ్చింది. మళ్లా వున్నప్పుడిచ్చిమంది.

రామ్మూ: ఈ టక్కులు నాకు తెలీకపోవు. తేతే యిలాగ!

సీతా: అదే బావుంది. ప్రతీదీ తే తే అంటూను!

రామ్మూ: నీలాగ వేషాలు వేసేవాళ్లదగ్గిర యిలాగే వుండాలి.

సీతా: వేషాలేమిటండీ! కావలిస్తే ఆవిణ్ణి పిలుస్తా నడగండీ!

రామ్మూ: మీ రందరూ తోడిదొంగలేన్లే. అంతా ముందే బందోబస్తు చేసుకుని నాటకాలాడతారు. ముందా సొమ్మిలా యిచ్చి. కర్చుకి చాలవు నా దగ్గిరివి.

సీతా: అవే చాల్తాయి. ఇవి మాత్రం యివ్వను. ఆవిడ కివ్వాలి!

రామ్మూర్తి: ఆఁ ఆఁ యివ్వాలి! ఇస్తావా ప్రయాణం మానుకుంటావా చెప్పు!

సీతా: అదే బావుందండీ! ఆవిడదగ్గిర పిల్లలకేమేనా కొందామనీ మనవడి చేతిలో పెడదామనీ అప్పుదెస్తే ఈ తీసుకోడం బావుంది.

రామ్మూ: బావుంటుంది బావుంటుంది. ఇలా ఇచ్చెయ్ ఆ సొమ్ము.

సీతా: మరీ పెళుసుబారిపోతోందీ. ఏదో సామిత చెప్పినట్టు!

రామ్మూ: ఇస్తావా యియ్యవా? ★

# పెద్దమనిషి

వెంకట్రామయ్యగారు పెద్దమనిషి. అలా ముక్కుమీద గుద్దినట్టు వెంకట్రామయ్యగారు పెద్దమనిషి అంటే - 'మేమేనా అంత చిన్న మనుషులం' అని మీకైనా మరెవరికైనా పెద్ద మనుషులైన వారికి కోపం రావొచ్చు! ఆమాట కొస్తే అసలు పెద్దమనిషి అంటే ఏంటని ఎవరైనా నిలదీసి అడగొచ్చు! పెద్దమనిషికి నిర్వచనం - గాంధిగారేం చెప్పారో, పట్టాభిగారేం చెప్పారో; యింకెవరేం చెప్పినా, వెంకట్రామయ్యగారి పెద్దతనానికి చిన్నతనం కల్గించలేదు.

ఏమైనా వెంకట్రామయ్యగార్ని పెద్దమనిషిగా లోకం గుర్తించింది; పెద్దమనిషిలా చెలామణి అవుతున్నాడు ఆయనగారు. అందాకా వస్తే అసలు వెంకట్రామయ్యగారే పెద్దమనిషి కాకపోతే మరెవరని? ఇది వెంకట్రామయ్యగారి నరాలను పట్టి జీర్ణించుకుపోయిన అభిప్రాయంకూడా!

ఆయన స్వహాతా పెద్దమనిషి; వాళ్ల నాన్న, తాతముత్తాతల్లో పెద్ద మనిషి అనిపించుకోని వాళ్లు లేరు; వారి వంశ వృక్షంలో లోకం చూడ గలిగిన మచ్చ లేదంటే అతిశయోక్తి లేదు.

వెంకట్రామయ్య గారి మూడో తరం ముత్తాత మాంచి స్థితిపరుడట. ఆయనకు లంకెల బిందెలు దొరికినవని పెద్దవాళ్లు యిప్పటికీ చెప్తాంటారు! అసలు ఆవంశంలో అన్నితరాల వాళ్లకు అంతో యింతో ఏదోవైపునుంచి వచ్చి కలుస్తూనే వుంది. వెంకట్రామయ్యగారి నాన్నకు మట్టుకు పది యెకరాల మాగాణి అనుకోకుండా వచ్చి కలిసింది. ఆ సంగతి చెప్తే - ఆకుటుంబం నిజాయితీ తెలియనివాళ్ళకు నమ్మటం చాలా కష్టంగానే వుంటుంది. ఆ యాస్తికి వారసులు ముగ్గురు పడవమునిగీ, వొకరు రైలు ప్రమాదంలో, యిద్దరు కలరా వచ్చి, యింకొకరు అగస్మాత్తుగా గుండె ఆగిపోయారు! అనాదినుంచీ వెంకట్రామయ్యగారి కుటుంబవ్యవహారాలు తెలిసినవాళ్లంతా 'అది వాళ్ల అదృష్టం' అంటారు. అంటే వెంకట్రామయ్యగారికి మాత్రం 'ఆ అదృష్టం' దర్శనం కాలేదు తెలిసినంతల్లో.

అయితే ఆస్థికితగ్గహోదా, హోదాకు తగ్గ కర్చూవుంటూనే వచ్చింది. వారి వంశంలో ఏతండ్రీ, తన కొడుక్కు - తన తండ్రి యిచ్చినంత ఆస్తి యివ్వలేదు. వెంకట్రామయ్యగారికి తండ్రిపోతూ వదిలేసింది వో పాతిక యెకరాలలోపు మాగాణి. పూర్వకాలం నాటి వో పెద్ద మండవాలోగిలి. ఏబాపతైనా యిద్దరు ముసలమ్మలు, ముగ్గురు నడివయసు వితంతువులు.

ఏమైనా వెంకట్రామయ్యగారు పెద్దమనిషి అని చెప్పే ప్రయత్నంలో యింట్లో వున్న వితంతువులు దాకా పోవడం ఏమంత పెద్దమనిషి లక్షణం అనిపించుకోంటుందని పెద్దమనిషి అయినవారెవరైనా అనిపోవచ్చు. అసలు పెద్ద మనిషి అయినవాడు మాత్రమే 'మరో' మనిషిలోని పెద్దమనిషి తనాన్ని చూడగలడు; వెంకట్రామయ్యగారి నమ్మకాల్లో యిదొకటి.

వెంకట్రామయ్యగారికి తెలియనిదంటూ ఏమీ వుండదని ఆ వూళ్ళో చాలామంది అభిప్రాయం. అలా అని వెంకట్రామయ్యగారెప్పుడూ తను సర్వజ్ఞుడని అనుకోలేదు.

ఆ వూరు పల్లెటూరే అయినా అంతో యింతో బస్తీవాతావరణం కనిపిస్తూనే వుంటుంది - పట్టణానికి చాలా దగ్గర్లో - రెండు మైళ్ళలో వుంటాన.

బస్తీలో కూడా చాలామంది వెంకట్రామయ్యగార్ని చూడకపోయినా ఆయన్ను గురించి వినేవుంటారు. ఇహ ఆ వూరిసంగతి వేరే చెప్పాల్సిన అవసరం లేదు. రేపటిమాట ఏమో చెప్పలేం కాని యీనాటివరకూ గ్రామానికి సంబంధించిన ప్రతి చిన్న విషయంలోకూడా వంకట్రామయ్యగారి సలహాలను పాటిస్తూనే వున్నారు. ఇంకా లోతుకుపోతే కొన్ని కుటుంబాల ఆంతరంగిక విషయాల్లో జోక్యం కలిగించుకోక తప్పలేదు ఆయనకు; అలా జోక్యం కలిగించుకోటం ఆయన యిష్టానికి వ్యతిరేకంగా చేయాల్సివచ్చిందే.

ఎప్పుడూ ఆయన ఇతరుల విషయాల్లో కావాలని తలదూర్చలేదు; అలా యెప్పుడైనా చేయాల్సొచ్చిందంటే వాళ్ళ, వాళ్ల బలవంతంమీదనే! వాళ్ళకు తనపై వున్న గౌరవం, నమ్మకం, అభిమానం మాత్రమే ఆయన్ను అలా ప్రేరేపించేవి. వెంకట్రామయ్యగారి బంధువుల్లో ఆయనకున్న పలుకబడి, విలువ, యిహాసరేసరి. ఆయనగారి ఎదుట నోరువిప్పి మాట్లాడగలిగిన వాళ్ళు చాలా తక్కువ అని చెప్పటం ఆయన్ను గురించి గొప్పగా చెప్పటం ఏం కాదు.

వెంకట్రామయ్యగారి మనస్తత్వం పూర్తిగా అర్థం చేసుకోవాలంటే - మరో వెంకట్రామయ్య జన్మెత్తి రావాల్సిందే! ఆయనగార్కి జీవితం విలువలపై సునిశితమైన అభిప్రాయాలు లేకపోలేదు; అయితే ఆయనెప్పుడూ ప్రచారంలో పెట్టలేదు. అవి ఆయనకు సంబంధించినవిగానే వుంచుకోగలిగాడు. అవి ఆత్మపారిశుద్ధ్యం కోసమేనని విశ్వసించి ఆత్మసంతృప్తి పొందారు.

వెంకట్రామయ్యగారు ఆధ్యాత్మిక చింతన గలవాడు. అలా అని - ఐహిక విషయాల్లో యెప్పుడూ అశ్రద్ధ చూపేవాడు కాదు. భగవద్గీతలో అర్జునుని చెవులో కృష్ణుడేమి చెప్పింది దగ్గర్నుంచీ; కోరియా

శ్రీ వాసిరెడ్డి నారాయణరావు

యుద్ధానికి, యిండియాలో మిరియాలు ధర పెరగటానికి, కారణాలు దాకా ఆయన గారికి సొంత అభిప్రాయాలున్నయ్. ఆయన ప్రపంచాన్ని ఎప్పుడూ ధిక్కరించ లేదు. అలా అని కళ్లు మూసుకుని అనుసరించనూ లేదు. అదే ఆయనగారి ప్రత్యేకత!

వెంకట్రామయ్యగారికి - మానవత్వం దగ్గర్నుంచీ నీతి నియమాలు దొంగతనం, రంకుతనం దాకా విడివిడిగా అన్నియిజాలపైనా ఏవో కొన్ని అభిప్రాయాలు వుంటూనే వచ్చాయి; కాలంతోపాటు వాటిని మార్చుకోటానికెప్పుడూ వెనకాడలేదు.

రాగాపోగా, వెంకట్రామయ్యగారి వ్యక్తిగత జీవితంలో తొంగి చూట్టంలోనే కొన్ని చిక్కులున్నయ్. వ్యక్తి స్వాతంత్ర్యానికి ప్రాధాన్యమిచ్చే ప్రజాస్వామ్యమున్న మనదేశంలో వెంకట్రామయ్యగారి వ్యక్తిగత జీవితాన్ని కెలకడం ఏమంత సబబయిన విషయం కాదు. సవరించబడిన రాజ్యాంగంలో రచయితగా నాకున్న హక్కు లెంతవరకో తెలుసుకోకుండా కళ్లు మూసుకుని వెంకట్రామయ్యగారిపై నాకున్న అభిప్రాయాలన్నిటినీ రాసేయడం - జరిమానాకో - అది చెల్లించలేం కాబట్టి విడిఖైదుకో సాహసించడం అవుతుంది!

ఏమైనా వెంకట్రామయ్యగారు జన్మతః పెద్దమనిషి అని లోకం వొప్పుకుంది.

ఇహ వెంకట్రామయ్యగారి కుటుంబంలో - ఎంతమంది వున్నారో, అది ఆయనమనస్సుకే పట్టని విషయం. అలాంటప్పుడు మీరు తెలుకోవాల్సిన అవసరమూ లేదు. ఆయనగారికి సంతానం వుంది. ఎంతమంది? అనే ప్రశ్న అనవసరం. వున్న పిల్లలు ఆయనకు బరువనిపించలేదు. తక్కువ అని దిగులూ పడలేదు.

భార్య మహాలక్ష్మమ్మగారు సరిగ్గా భర్తకు సగం 'హంశ' పంచుకుంది. ఆమెకు సంబంధించిన అన్ని విషయాల్లో పూర్తిగా భర్తను అనుసరించుతుంది. ఆమెకు యిష్టం, అయిష్టం అంటూ ఏమీ లేదు. ఆమెకు అసలు అభిప్రాయాలు, అభిరుచులు అంటూ లేవనడం సాహసం కావొచ్చేమో కాని సొంత అభిప్రాయాలు ఏమీ లేవనడం సత్యదూరం కాదు. వెంకట్రామయ్యగారు భార్య మహాలక్ష్మమ్మపై అభిమానం, గౌరవం, విశ్వాసం వుంచారు.

వెంకట్రామయ్యగారు తరుచుగా బస్తీకి వెళ్తూనే వుంటారు. పేరుకు రెండు మైళ్ళ దూరమైనా- ఆవూరు బస్తీ కలిసేవుంటయ్. కొత్తగా కట్టిన కాలేజీ, మంత్రినగరు వెంకట్రామయ్యగారి వూరును బస్తీతో కలిపివేశాయి. సిమెంటురోడ్డు వేయడమేమి, సైకిల్ రిక్షాలు రావడమేమి, అన్నీ ఆయన కళ్లముందే జరిగిపోయినై. అయినా ఆయనగారు ఎప్పుడూ రిక్షా యెక్కిన పాపాన పోలేదు. అలా మనుషులచేత యీడిపించుకోటం చిన్నతనంగాను, ప్రకృతికి విరుద్ధంగానూ భావించేవారు. కాని చాలమంది ఆయనే వింతప్రకృతి అంటారు మరి!

వేసవి ఎండలు తగ్గుముఖం పట్టాయి. వసంతఋతువు ఆగమనసూచకంగా నాలుగు చినుకులు పడి నేల కొత్తకంపు కొడ్తూంది. వెంకట్రామయ్యగారు భార్య మహాలక్ష్మమ్మను పిలిచి, పెట్టెలోవున్న ఖద్దరు లాల్చీ - పొడుగు చేతుల్ది, తీసుకు రమ్మన్నారు. ఆమెగారు అప్పుడే గ్రహించింది. ఆయనగారు బస్తీకి వెళ్లే ప్రయత్నంలో వున్నాడని. పొరుగూరు పోయేప్పుడు మాత్రమే ఆ పొడుగు చేతుల చొక్కా వేస్తూంటాడు. ఊళ్ళోవున్నప్పుడు మామూలుగా, ముంచేతులపైకి, మోచేతులక్రిందికి వుండే చొక్కాలు వేస్తూంటాడు; ఇంట్లోవుంటే అసలు చొక్కా వుండదావంటిమీద. వోకండ వాతప్ప.

వెంకట్రామయ్య గారిదినిండైనవిగ్రహం. కండపుష్టి లేకపోయినా యెముకపుష్టి వుంది. పొడుగ్గా చామనచాయగా వుంటారు. కోలముహానికి కళ్లజోడు అతికినట్టు వుంటుంది; అద్దాల్లో గుండా చూసే ఆయన చూపులో ప్రత్యేక ఆకర్షణ వుంది. మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతూండగా ఆయనగారు మహాలక్ష్మమ్మను వివాహం చేసుకున్నాడు, పెళ్లినాటికి ఆయనకు పదిహేను సంవత్సరాలకంటే ఎక్కువ వుండవు. ఆమెగారికి అప్పటికి ఏడు సంవత్సరాలు నిండినవేమో!

ప్రపంచం చీకటి ముసుకులోకి పోతూంది. మునిస్పాలిటి దీపాలు అప్పుడే వెలిగాయి. వెంకట్రామయ్య గారు పెద్ద బజారు మలుపు తిరిగి పక్కసందున నడుస్తున్నారు. సిల్కులాల్చీ, పెద్ద క్రాఫ్‌తో టక్, టక్ బూటు శబ్దం చేసుకుంటూ, టిప్, టాప్‌గా పోతూన్న వొకయువకునిపై ఆయనగారి దృష్టి అప్రయత్నంగా పడింది. సరిగ్గా ఎలక్ట్రిక్ దీపపు స్తంభం దగ్గరకొచ్చేప్పటికి, తారురోడ్డు మధ్యగా పడివున్న కాగితపు పొట్లాం వొకటి, కళ్ల అద్దాల వెనకున్న ఆయనగారి కళ్లను ఆకర్షించింది!

ఆ యువకుడు పక్క జేబులోంచి ఏదో తీస్తూన్నపుడు పొరపాటున యీ పొట్లాం కాస్తా జారి కిందపడివుంటుందని ఊహించారు - వెంకట్రామయ్య గారు; వూహించడమే కాదు - యాదాలాపంగా చూసే వుంటారు కూడా! ఇలాంటి వాటన్నిటినీ పట్టీ పట్టనట్టు, చూసీ చూడనట్టు పోయే స్వభావం ఆయన్ది మొదట్నించీ కాబట్టి చూసినా చూడనట్టే!

ఆ పొట్లానికి రెండడుగుల దూరంలోనే నిలుచుని కొయ్యబారిపోయాడు! ఏదో వింతశబ్దం చేశాడు ముందు పోయేవాణ్ని ఆపాలనే వుద్దేశ్యంతో; నిజం చెప్పాల్సివస్తే ఆయన చేసినధ్వని పక్కవాడికికూడా వినిపించదు. అలా అని ఆయనగారు

(46-వ పేజీ చూడండి)




# ★ దసరా ★

★

రచన: శ్రీ రావి కొండలరావు

దసరా పండగ వచ్చిందీ,
సరదా మనకీ తెచ్చిందీ.
బాలలమంతా మేము
బాణాలట్టుకు పోతాము—

ప్రతీ ఇంటికీ వెడతాము
పప్పు బెల్లాలు తింటాము
సాయంత్రానికి వస్తాము
బొమ్మలకొలువుకి పోతాము—

రంగురంగులా బొమ్మలు ఎన్నో
లింగులింగుమని ఎగిరేవెన్నో
కీ యిస్తేనూ తిరిగేవెన్నో
వాయిస్తేనూ మ్రోగేవెన్నో—

రకరకాలా కొలువులు చూసీ
రాత్రి కింటికి వస్తాము.
హాయిగ ఆటల పాటలతోనూ
మాటలాడుతూ పడుకుంటాము—

విజయదశమినాడు వేగమే లేచి
వెచ్చన్ని నీళ్ళతో తలలంటుకుంటాము
నున్నగా తలదువ్వి తిన్నగా బొట్టెట్టి
పుస్తకాలకి మేము పూజచేస్తాము—

సరస్వతీదేవి చల్లన్ని దేవి
చదువు సంధ్యలుమాకు చక్కగా నేర్పి
దక్కించవమ్మ మా పూజలకి ఫలమూ
దీవించవమ్మ నీ చెయ్యెత్తి మమ్మూ—

# జంతువులు - పక్షులు



ఆడ-చిరుతపులి, దాని పిల్ల

సృష్టిలో ఎన్నో విచిత్ర జంతువులున్నాయి. వీటిలో చాలావాటిని చూసే అవకాశం మనకు కలగనే కలగదు. ఎందుకంటే అవి అరణ్యాల్లోను, పర్వతాల మీద, ఎడారుల్లో, సముద్రాల్లో జీవిస్తూ ఉంటాయి. మచ్చికచేసి పెంచడానికి వీలైన జంతువులనన్నిటినీ మనం పెంచుతూనేవున్నాము. వాటివల్ల ఉపయోగాలు పొందుతూనే వున్నాము. కాని అనేకమృగాలు మచ్చిక చేయటానికి లొంగవు. అలాంటివి మానవప్రపంచానికి దూరంగా ఉండిపోతాయి. అదీగాక కొన్ని అడవి జంతువులవల్ల మనకిపెద్ద ఉపయోగమూ లేదు. మరి అటువంటి వాటిని చూసేఅవకాశం మనకెల్లా కలుగుతుంది?

అడవిమృగాలను, పక్షులను వేటాడి పట్టుకుని జంతు ప్రదర్శన శాలల్లో ఉంచుతారు. పెద్దపెద్ద నగరాలన్నిటిలోను ఈప్రదర్శన శాలలున్నాయి. అక్కడకు వెడితే సృష్టిలోగల విచిత్ర జంతువులను వినోదంగా చూసే అవకాశం కలుగుతుంది. చెన్నపట్టణంలో కూడా కార్పొరేషనువారు జంతు ప్రదర్శన శాల (జూ)ను ఏర్పాటు చేశారు. అందులోఉన్న కొన్ని జంతువులను గూర్చి, పక్షులనుగూర్చి విశేషాలు వారం వారం మీరీ పత్రికలో చదివి తెలుసుకోవచ్చు.

## చిరుతపులి

పిల్లిజాతికి చెందిన ఈ మృగం ఆఫ్రికా, ఆసియాఖండాల అరణ్యాల్లో, కనబడుతుంది. చాలా అందంగా వుంటుంది. వంటినిండా నల్లటి మచ్చలుంటాయి. వళ్లంతా నల్లగా ఉండే చిరుతపులులు కూడా ఉన్నాయి. కాని ఇవి మామూలు చిరుతలకంటె పెద్దవి. సాధారణంగా చిరుతపులులు తోకతో కలుపుకుని, 6 నుండి $7\frac{1}{2}$ అడుగుల వరకూ పొడుగు ఉంటాయి. ఇవి మహా క్రూరజంతువులు; అందులో నల్ల చిరుతలు మరీని. వీటికి రక్తదాహం ఎక్కువ. జిత్తులు వెయ్యటంలో



నల్ల-చిరుతపులి

నక్కల్ని మించిపోతాయి. చెట్ల చాటున, పొదల్లోను, నక్కి అమాంతంగా చిన్న జంతువులమీద పడి చంపేస్తాయి. ముఖ్యంగా కుక్కల్ని చంపటం, తినటం అంటే వీటికిష్టం. ఇవి ఒక్కసారిగా 2 నుండి 5 వరకూ పిల్లలను పెడతాయి. పిల్లలు 87 నుండి 99 రోజులవరకూ కడుపులో ఉంటాయి. చీటా లనబడే రకం చిరుతపులులు గంటకి 70 మైళ్ల వేగంతో పరిగెత్తగలవు. చిరుతపులులు మామూలుగా 8 గళ్లు బ్రతుకుతాయి. కాని 20 ఏళ్ల వీరిష్ట పరిమితిదాకా బ్రతికినవి కూడా ఉన్నాయి.

## చారల గుర్రం

దీన్ని ఇంగ్లీషులో జీబ్రా అంటారు. గుర్రంజాతికి చెందినది. నాలుగడుగుల ఎత్తుంటుంది. ఒళ్లంతా తెల్లటి చారలుంటాయి. పొడుగాటి చెవులు, పొట్టిజూలు ఉంటాయి. ఆఫ్రికాఖండంలోనే ఇవి నివసిస్తాయి. మందలు మందలుగా జీవిస్తాయి. ఉలవలు, ఓట్లు, కారట్లు, పచ్చిక తింటాయి. ఆడ జీబ్రా గర్భధారణకాలం 346 నుండి 395 రోజుల వరకు. ఒక్కొక్క సారికి ఒక్క పిల్లే పుడుతుంది. పన్నెండేళ్లు బ్రతుకుతాయి. కాని29 ఏళ్లవరకూ బ్రతికినవికూడా ఉన్నాయి. గంటకి నలభై మైళ్ల వేగంతో పరిగెత్తగలవు

## పంచవర్ణ చిలుకలు

ఈ చిలుకలు ప్రకృతిలోని అందాన్నంతా పుణికి పుచ్చుకున్నాయని పిస్తుంది. ఆ రంగుల సమ్మేళనం చూసితీరవలసిందే గాని చెప్పలేము. ఇవి దక్షిణ అమెరికాలోని ఉష్ణమండలారణ్యాల్లో ఉంటాయి. వీటి ముక్కులు ఉక్కుకంటే బలిష్ఠంగా ఉంటాయి. పెద్ద సుత్తితోగాని పగలగొట్టలేని



పంచవన్నెల చిలుక

కాయల్ని, గింజల్ని ఇవి ముక్కుతో ఇట్టే పిండిపిండి చేస్తాయి. తాటికాయలు, సెనగలు, మిరపకాయలు తింటాయి. పెంచేవాళ్లు రొట్టె, పాలుకూడా ఇస్తారు. చెట్లమీద పాకేటప్పుడు ముక్కుతో పట్టుకుని మరీ పాకుతాయి. ఇవి 20 ఏళ్లనుంచి 64 ఏళ్లవరకూ బతకగలవు. చెన్నపట్నం ప్రదర్శనశాలలో ఈ జాతివే మూడురకాల చిలకలున్నాయి. ఒకరకం నీలం-పసుప్పచ్చ; రెండోరకం ఎరుపు—పసుప్పచ్చ; మూడోరకం ఆకుపచ్చ - నారింజరంగు.



చారలగుర్రం

## తెల్లచిలుకలు



ఇవి పూర్తిగా తెల్లగాఉంటాయి. వీటి స్వదేశం ఆస్ట్రేలియా. వీటి ముక్కులుకూడా బలిష్ఠంగా ఉంటాయి. ఇవి ఎంతగట్టిగా ఉండే పెంకునైనా సరే బద్దలుగొట్టి లోపలి గుజ్జుతినటం చూస్తుంటే ఎంతైనా తమాషాగా ఉంటుంది. వీటినిపెంచడం తేలిక. ఈబొమ్మలో కనపించే తెల్లచిలుకకు "ఇంజనీరు" అని పేరుపెట్టారు. ఎందుకంటే ఇది గోడల్నికూడా దొలుచుకుని పక్కనున్న పంజరంలోకి పోతుందట. ఈచిలకల్ని గయ్యాళి ఆడవాళ్లతో పోల్చవచ్చు. "మాఅందం చూసుకోండోయ్" అన్నట్టు గర్వంగాఒయ్యారంగా నడుస్తాయ్ ఊరికే అస్తమానమూ కీచు లాడుతూంటాయ్. సంతోషంగా ఉన్నప్పుడు దాగుడు మూతలుకూడా ఆడతాయ్. ఇవి 30 నుండి 81 ఏళ్లవరకూ బ్రతకగలవు. ★






**జరిగినకథ :**

మాకు బ్రిస్టల్ నగరసమీపంలో ఒక హోటల్ ఉంది. ఒకరోజున మా హోటలుకు 'బిల్' అనే సముద్రపుదొంగ తనతోటి దొంగలనుండి తప్పించుకుని పారిపోయివచ్చాడు. అతడు మా హోటల్లో ఉన్నాడని మిగతా దొంగలకు తెలిసి, అతన్ని చంపేస్తామని బెదిరించారు. అతడు ఆ బెదిరింపుకే భయపడి చనిపోయాడు. అతడు మాకు కొంత డబ్బు బాకీ ఉన్నందున మా అమ్మ, నేను అతని పెట్టె తెరిచి కొంత డబ్బు, ఒక వింతపార్సిలు తీసుకుని సముద్రపు దొంగలనుండి తప్పించుకుని పక్క గ్రామానికి పారిపోయాము. పార్సిలును మా డాక్టరుగారికి, జమీందారుగారికి చూపాను. దాన్ని తెరిచిచూడగా కాంచనద్వీపపటం కనిపించింది. వెంటనే అక్కడి ధన నిక్షేపాలు సంపాదించే ఆశతో అక్కడికి ప్రయాణమయ్యాము.

(బొమ్మలు వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్సు, ఆర్. కె. ఓ. రేడియోవారి సౌజన్యంతో)

## 7. నా బ్రిస్టల్ ప్రయాణం

మేము సముద్ర యానానికి సిద్ధం కావడం జమీందారుగా రూహించిన దానికంటె ఆలస్యం అయింది. అసలుమేము మొదట్లో వేసుకున్న ప్లానుల్లో ఒకటీ అనుకున్నట్టు జరగలేదు. డాక్టరు లివ్ సేగారూ, నేను ఒకరినొకరం వదిలిపెట్టి ఉండరాదని మొదట్లో అనుకున్నా, అలా సాధ్యంకాలేదు. డాక్టరుగారు తన ప్రాక్టీసు నెవరికి అప్పజెప్పాలా అని సమస్యలోపడి చివరికి మరొక డాక్టరును మాట్లాడేందుకు లండన్ వెళ్లారు. జమీందారుగారు బ్రిస్టల్‌లో ఓడకు సంబంధించిన ఏర్పాట్లలో మునిగిఉన్నారు. ఇక నేను మాత్రం రోజులతరబడి జమీందారు గారింట్లోనే ఉండిపోవలసి వచ్చిది. నేనెక్కడికీ కదలకుండా చూసేందుకు జమీందారుగారు తన తోటమాలి రెడ్రూత్‌ను కాపలా ఉంచారు.

ఆకాసిని రోజులు కారాగారంలో ఉన్నంత బాధ పడ్డాననుకోండి. వృద్ధుడైన రెడ్రూత్‌ను తప్పిస్తే మరో ప్రాణి లేడాయెను మాట్లాడేందుకు. ఒంటరిగా ఆ దివాణంలో ఏమితోచక చచ్చేవాణ్ణి. అస్తమానమూ నా ఆలోచనలు కాంచనద్వీపంపైకే పోయేవి. ఎప్పుడూ ఆద్వీప పటంలోని వివరాలనుగూర్చే కలలు కనేవాణ్ణి. హాల్లో చలిమంట దగ్గిరగా సోఫాలో కూర్చుని ఊహాలో ద్వీపదృశ్యం చిత్రించుకుని గుప్త ధనంకోసం ప్రతిఅంగుళమూ అన్వేషించేవాణ్ణి. 'టెలిస్కోప్ కొండ' అని పిలవబడే ఆ ఎత్తైనకొండ ఎన్ని వందలసార్లుఎక్కి ద్వీపరామణీయకం చూసి ఆనందించానో చెప్పలేను. ఒక్కోసారి ద్వీపమంతా ఆటవిక మనుష్యులతో నిండివున్నట్లు, మేము వాళ్లతో ఘోర యుద్ధంచేసి ఓడించినట్లు ఉహించుకునేవాణ్ణి. ఇంకోసారి క్రూర వనమృగాలతో నిండివున్నట్లు, మమ్మల్ని అవి నిరంతరం వెంటాడినట్లు అనిపించేది. కాని మేము కాంచన ద్వీపంలో నిజంగా ఎదుర్కోవలసి వచ్చిన అపాయాలతో పోల్చిచూస్తే ఈ ఉహా ప్రమాదాలు ఏమూలకి?

కొన్నివారాలు ఇలా సోమరిగా గడిచాయి. ఒక శుభ ప్రభాతాన బ్రిస్టల్ నగరంనుండి ఒకలేఖ వచ్చింది. అది డాక్టర్ లివ్ సే పేరిటవచ్చినా, "డాక్టర్ ఉల్లోలేకపోతే టామ్ రెడ్రూత్ గాని, జిమ్ హాకిన్స్‌గాని తెరవవచ్చు," అని పైన వ్రాయబడివుంది. డాక్టరు గారింకా లండన్‌నుండి తిరిగిరాలేదు. అందుచేత మేము కవరుచించి . చూశాము. మా రెడ్రూత్ అచ్చు అక్షరాలుతప్ప రాత తిన్నగా చదవలేడు. కనుక నేనే ఉత్తరంచదివి వినిపించాను:—

అనువాదం : శ్రీ నండూరి రామమోహనరావు

పాతలంగరు హోటల్,
బ్రిస్టల్, మార్చి 1, 17—.

ప్రియమైన లివ్‌సే,

నువ్వు మా ఇంటిలో ఉన్నావో లేవో తెలియదు. కనుక ఈఉత్తరం నకలు లండన్‌కూడా పంపిస్తున్నాను.

ఓడకొనేశాను. హార్బరులో రెడీగాఉంది. అంత మధురమైన, సుందరమైన ఓడ నువ్వు జన్మలోచూసి ఉండవు—నాలుగేళ్ల పాపాయికూడా దాన్ని నడపగలదు—రెండువందల టన్నులబరువు—పేరు హిస్పానియోలా.

ఆఓడని నాపాత మిత్రుడు బ్లాండ్లీ సంపాయించి పెట్టాడు. అతనంతటి అద్భుతుణ్ణి నేనెక్కడా చూళ్లేదు. నాకోసం ఎంతశ్రమపడ్డాడనుకున్నావ్. అతనేకాదు—అంతా అల్లాగే మనకోసం శ్రమపడ్డారు—మనం వెడుతున్నపని (డబ్బంటే ఏమిటిమరి?) చెప్పేసరికి గులాములైపోయి సలాములు కొట్టారనుకో నాకు."

ఉత్తరం ఆపాను. "రెడ్రూత్! చూశావా, జమీందారుగారు అందరితోనూ చెప్పేస్తున్నారు, డాక్టరుగారు వద్దన్నాకూడా," అన్నాను.

"అది ఆయనఇష్టం. డాక్టరుగారెవరు వద్దనటానికి? అన్నాడు స్వామి భక్తుడైన రెడ్రూత్. .

ఇక వ్యాఖ్యానించడం మానేసి ఉత్తరం చివరికంటా చదివాను:—

ఓడలో వేలెత్తి చూపటానికూడా లోపంలేదు. చూసినవాళ్లు, చూడనివాళ్లూకూడా అదేమాటన్నారు. కాని ఒక్కటే వచ్చిందిచిక్కు. ఓడనడిపే సిబ్బంది దొరకడం గగనమైపోయింది. కనీసం ఇరవైమందన్నా ఉండాలిగా—ఏమో ఆద్వీపంలో మనుష్యుల్ని నంచుకుతినే జాతివాళ్లున్నారేమో ఎవరికి తెలుసు; పైగా సముద్రపు దొంగలు మన్ని ఎదుర్కోరని నమ్మకమేమిటి?—కాని అరడజనుమంది దొరికేటప్పటికి తాతలు దిగొచ్చారు. కాని దేవుడు దయవల్ల అదృష్టం తోసుకొచ్చింది. నాకొక్కవలసిన మనిషి దొరికాడు.

మనఓడ సరంబీమీద నుంచుని బుర్ర గోక్కుంటున్నాను. ఇంతలో ఒకమనిషి చక్కావచ్చాడు. అనుభవంగల నావికుడు; బ్రిస్టల్‌లో అతనెరగని కళాసీలేడు; చాల రోజులైందట సముద్రం వదిలి; నీటిబైట చేపమాస్తరుగా వుందిట అతనికి; మళ్లీ సముద్రయానం చెయ్యాలనుందట; ప్రస్తుతం హోటలు పెట్టుకుని గడుపుతున్నాడట; ఎవరన్నా వంటవాడుగా ఉద్యోగమిస్తే బావుండునని చూస్తున్నాడట.

అతనికథవిని నాకు చాలా జాలివేసింది. వెంటనే మన ఓడలో వంటవాడుగా కుదిర్చాను. అతనిపేరు లాంగ్ జాన్ సిల్వర్; ఒక కాలులేదు పాపం; యుద్ధాల్లో పోగొట్టుకున్నాడట; మనదేశం తరఫున యుద్ధాల్లో పాల్గొని ఒక కాలు త్యాగంచేశాట్ట. కాని అతనికి ప్రభుత్వం పింఛనైనా ఇవ్వటంలేదు. హు! ఏం ప్రభుత్వమోయ్, లివ్‌సే, వెధవ ప్రభుత్వం.

నేను మంచివంటవాణ్ణి మాత్రమే సంపాదించాననుకున్నాను; కాదు—ఒకసిబ్బందినే సంపాదించినట్లయింది. ఎందుకంటే సిల్వర్ సహాయంతో రెండుమూడు రోజుల్లో మనక్కావలసినంతమంది కళాసుల్ని సేకరించాను. చూట్టానికొస్తే బావుండరనుకో. కాని అతిసాహసులు; అతిసమర్థులు; పసిఫిక్ సముద్రాన్ని ఈదమన్నా కళ్లుమూసుకునే దూకేటంత దమ్ములున్న వాళ్లు. వాళ్లతో మనం బయల్దేరితే హిస్పానియోలా "ఈరేడు జగంబుల నజేయంబు."

నేను అంతకుముందు మాట్లాడిన అరడజను కళాసీల్లో ఇద్దర్ని సిల్వర్ మాటమీద డిస్మిస్ చేసి పారేశాను. వాళ్లువట్టి చవటలని అతను అభిప్రాయ పడ్డాడు.

నాఆరోగ్యం బాగా నేవుంది. మదించిన ఆంబోతులా తింటూ, తుమ్మమొద్దులా నిద్రపోతున్నాను. కాని మనం బయల్దేరే వరకూ నాకు మనశ్శాంతి ఉండదు. నాముద్దుల కాంచనద్వీపం ఎప్పుడు చూస్తానో! వెధవడబ్బు — ఎవడికొక్కవాలోయ్? నాకిప్పుడు డబ్బు తక్కువైందనా? సముద్రాలమీద దూర, నిర్జన ప్రదేశాలకు వెళ్లాలనే కుతూహలంగాని. లివ్‌సే! నుంచున్నపళంగా బయల్దేరిరా—నామీద ఏమాత్రం గౌరవమున్నా ఆలస్యం చెయ్యకు.

జిమ్‌హాకిన్స్ వాళ్లమ్మను చూడాలనుకుంటుంటే రెడ్రూత్‌ను తోడిచ్చి పంపించు. తరవాత వాళ్లిద్దరూ బ్రిస్టల్ వస్తారు.

జాన్ ట్రెలానీ.

ఒకముక్క:—మనం ఆగస్టునెలాఖర్లోగా తిరిగి రాకపోతే బ్లాండ్లీమన్ని వెదికేందుకు మరొకఓడను, సిబ్బందిని పంపిస్తానన్నాడు. మర్చిపోయా—మనఓడకు బలేమంచి కెప్టెన్ దొరికాడు. కొంచెం తల బిరుసుమనిషిగాని, తతిమా విషయాల్లో అమూల్యుడనుకో. లాంగ్ జాన్ సిల్వర్ మనఓడకు మంచి తండేలును సంపాయించాడు; అతనిపేరు యారో.

సిల్వర్ ఏమి టనుకున్నావో, మంచిస్థితి మంతుడే. బ్యాంకిలో చాలా నిలవ వేశాడు. అతనికో నీగ్రో పెళ్లాముంది. ఆమెకు హోటల్ నడిపే బాధ్యత అప్పగించాడు. కొంచెం గయ్యాళిదని వినికిడి. నువ్వూ నేను బ్రహ్మచారిగాళ్లమైనా, సిల్వర్ పెళ్లాన్ని విడిచి సముద్రాలకు యెందుకు ఎగబడుతున్నాడో గ్రహించడం కష్టంకాదు.

జా. ట్రె.

ఇంకోముక్క:—హాకిన్స్ వాళ్లమ్మదగ్గిర ఒక్కరోజుకంటే ఎక్కువ ఉండటానికి వీల్లేదు.

జా. ట్రె

ఈఉత్తరం చదువుతుంటే నాగుండె సంతోషంతో ఎంత వేగంగా కొట్టుకుందో చెప్పక్కర్లేదు.

మర్నాడు ఉదయం రెడ్రూత్‌తో కలిసి నేను "ఎడ్మిరల్ బెన్‌బౌ"కు బయల్దేరి వెళ్లాను. మా అమ్మ కులాసాగానే వుంది. మాహోటల్ వ్యాపారం యథాప్రకారంగా సాగుతూనే వుంది. జమీందారు గారు ఈలోగా హోటల్ అంతా మరమ్మతు చేయించారు. కొత్త సామాను కూడా కొనిపెట్టారు. హాల్లో మా అమ్మ కూర్చునేందుకొక అందమైన సోఫాకూడా అమర్చారు. నేను లేనంతకాలం మా అమ్మకు చేదోడు వాదోడుగా ఉండేందుకు నాయీడు కుర్రాణ్ణి ఒకణ్ని కూడా నియమించారు.

జమీందారుగారి దివాణంలోఉన్నంత కాలమూ సముద్ర యానంమీదనే మనస్సుపెట్టుకుని ఉన్నవాణ్ణి, మా అమ్మను చూడగానే, నాకు అపరాని దుఃఖం వచ్చింది. నాకు శైశవంనుండీ బాగా పరిచయమైన మా "బెన్ బౌ" పరిసరాలను, కొండలను, అడవులను, సముద్ర తీరాన్నివదలి వెళ్లడం ఎంతకష్టమో అప్పుడు తెలిసింది.

ఆరాత్రి మాఇంట్లోనే గడిపాను. మర్నాడు భోజనమైనాక మళ్లీ రెడ్రూత్, నేనూ కలిసి బయల్దేరాము. మాఅమ్మకు వీడ్కోలిచ్చాను. "బెన్ బౌ"కు, కొండలకు, అన్నిటికీ వీడ్కోలిచ్చాను.

బ్రిస్టల్ నగరానికి టిక్కెటు పుచ్చుకొని టపాబండి ఎక్కాము.

నేను రెడ్రూత్ కూ, మరొకస్థూలకాయుడైన పెద్దమనిషికీ మధ్యఇరుక్కుని కూర్చున్నాను. కనుక ఆరాత్రి ఎంత చలిగాఉన్నా నాకు వెచ్చగానేఉంది. బండి కుదుపులకు చక్కటి నిద్రకూడా వచ్చింది. లేచేటప్పటికి తెల్లవారింది. "అబ్బాయ్! బ్రిస్టల్ వచ్చాంలే" అని రెడ్రూత్ అంటున్నాడు.

ఇద్దరం బండిదిగాము. జమీందారుగారు హార్బరుకు దగ్గరలోనే బసచేశారు—మాఓడ మరామత్తులు కరామత్తులు దగ్గిరుండి చేయించవచ్చు గదా అని. అక్కడికి నడిచిపోయాము. దోవలో రకరకాల ఓడలు, రంగు రంగులవి, దేశదేశాలవి ఎన్నో కన్నుల పండువుగా కనిపించాయి. ఒకఓడలో కళాసీలు పదాలు పాడుకుంటూ పనులు చేసుకుంటున్నారు. ఇంకొక ఓడలో ఎత్తయిన తెరచాప కొయ్యలపై కెక్కి పనిచేస్తున్నారు. అంతకుముందు ఎప్పుడూ అటువంటి గొప్ప దృశ్యం చూడలేదు నేను. కళాసీలు బలే తమాషాగా వున్నారు. చెవులకు ఇత్తడిరింగులు, గడ్డాలు, మీసాలు పిలకలు—వాళ్లని చూసినకొద్దీ చూడ బుద్ధయింది. అంతమంది మహారాజుల్ని చూసినా నాకు అంత సంతోషం కలిగేది కాదేమో.

పైగా నేనుకూడా సముద్రయానం చెయ్యబోతున్నాను. 'మధురమైన, సుందరమైన, హిస్పానియోలానౌకలో, ఎక్కడికో, ఎంత దూరానికో వెళ్లిపోతున్నాను. హాయ్, హాయ్! ఎంత గొప్పఅదృష్టం నాది!

ఇల్లా మధురస్వప్నాల్లో తేలిపోతున్న నన్ను రెడ్రూత్ చెయ్యిపట్టుకుని కుదిపిందాకా నాకు తెలివేరాలేదు. మాసేటప్పటికి జమీందారుగారు ఎదురుగా నవ్వుతూ కనిపించారు, హోటల్ మెట్లమీద నుంచుని. ఆయన అప్పుడే కొత్తబట్టలు కుట్టించి వట్లున్నారు. పక్కా 'ఎడ్మిరల్' (నౌకసర్వాధికారి) వేషంలో ఉన్నారు. అంతేకాదు—నావికుల నడకనికూడా పట్టేశారు.

"మీరూ వచ్చారే," అంటూ ఆయన మా దగ్గిరికివచ్చి లోపలికి తీసుకుపోయారు. "డాక్టరు రాత్రే లండన్ నుండి వచ్చాడు. సిబ్బంది సంపూర్ణమైంది మీరు రావటంతో. హేయ్, బ్రేవో!" అని ఉషారుగా అన్నారు.

"సార్. మనప్రయాణం ఎప్పుడు?" అని అడిగాను అంతకంటే ఉషారుగా.

"ప్రయాణమా? రేపేనోయ్, రేపే!"

## 8. "టెలిస్కోప్"

ప్రాతఃకాల భోజనం ఆరగించాను. జమీందారుగారు లాంగ్ జాన్ సిల్వర్ కు ఒక ఉత్తరంరాసి నాద్వారా పంపించారు. హార్బరుగోడ్డు వెంబడే పోతే "టెలిస్కోప్" అనే పేరుగల హోటల్ కనిపిస్తుందనీ, అక్కడ సిల్వర్ కనిపిస్తాడనీ చెప్పారు. మళ్లీ కొన్ని ఓడల్ని, నావికుల్ని చూడవచ్చుగదా అని ఎగురుకుంటూ బయల్దేరాను. రోడ్డంతా సరుకులు తీసుకువచ్చే బళ్లూ, తీసుకుపోయే బళ్లూ. జనసమ్మర్దం పొద్దుటికంటే ఎక్కువైంది.

కొంతదూరంపోగా "టెలిస్కోప్" హోటలు కనిపించింది. బోర్డుమీద టెలిస్కోప్ బొమ్మకూడా ఉంది. గోడలకు కొత్తగా వెల్లవేశారు. కిటికీలకు ఎర్రటి తెరలున్నాయి. హోటల్ కు అపక్క ఈపక్క సందులున్నాయి. సందుల్లోకి తెరుచుకుని ద్వారాలున్నాయి. లోపలికిగాలీ, వెల్తురూ బాగావస్తూ కళకళలాడుతూ ఉంది.

లోపల ఫలహారాలు, పానీయాలు సేవిస్తున్నవారిలో చాలమంది నావికులే. వాళ్లమాటలు, మొహాలు బలే దౌర్జన్యంగా ఉన్నాయి. లోపలికడుగు పెట్టడానికి జంకుతూ గుమ్మంలోనే నిలబడ్డాను.

ఇంతలో పక్కగదిలో నుండి ఒకమనిషి వచ్చాడు. చూడగానే లాంగ్ జాన్ సిల్వర్ అని తెలిసి పోయింది. ఎడమకాలు తొడసమీపంలో కోసివేయ బడివుంది. ఎడమచంకలో ఉతకర్ర పెట్టుకున్నాడు. పిచ్చిక గెంతినంత తేలిగ్గా గెంతుతూవచ్చాడు. మనిషి చాలా పొడుగ్గా, బలిష్ఠంగా ఉన్నాడు. మొహం గుండుగాబండగా ఉన్నా తెలివితేటలు ఉట్టిపడుతూ, చిరునవ్వుతో విప్పారి ఉన్నది. ఉత్సాహంగా, కూని రాగంతీస్తూ, బల్లలమధ్యగా ఎగురుకుంటూ, నన్ను సమీపించాడు.

నిజం చెప్పాలంటే, ఆరోజున జమీందారు గారు రాసిన ఉత్తరంలో లాంగ్ జాన్ సిల్వర్ పేరు చూసినప్పటినుండి నాకు భయంగానే వుంది—బిల్లీ బోన్స్ చెప్పిన "ఒంటికాలు పెద్దమనిషి" ఇతడే నేమో నని. కాని మనిషిని ఒక్కసారి చూడగానే నాభయా లన్నీ తీరిపోయాయి. బిల్లీబోన్స్, నల్లకుక్క, ప్యూ మొదలైనవారిని చూశాను గనుక సముద్రపు దొంగ లంటే ఎలా ఉంటారో నాకు తెలుసు. సిల్వర్ ను చూస్తే ఘరానామనిషి అనిపించాడు గాని ఎక్కడా అనుమాన పడటానికి ఆస్కారమేలేదు.

"మిస్టర్ సిల్వర్ అంటే మీరేనా?" అని అడి గాను.

"అవునమ్మా, నేనే," అన్నాడతడు. "నీపేరు", అని అడిగాడు. నేను మాట్లాడకుండా జమీందారు గారి ఉత్తరం అందించాను. అది చూడగానే ఒక్కసారి ఉలికిపడి నావంక చూశాడు.

"ఓ. నువ్వా? సరిసరి నువ్వు మాఓడ కుర్రా డివిగదూ? నిగురించి చెప్పార్లే జమీందారుగారు," అంటూ కరస్పర్శ చేశాడు.

అంతలో అవతల చివర ద్వారానికి దగ్గరగా కూర్చున్న ఒకడు హఠాత్తుగాలేచి బైటికి వెళ్లి పోయాడు. నేను వాణ్ని చూడగానే గుర్తుపట్టాను.

"ఓర్ని. వాణ్ని పట్టుకోండి. నల్లకుక్క!!" అని అరిచాను.

"నల్లకుక్కో, తెల్లకుక్కో నాకనవసరం. కాని వాడెవడో బిల్ చెల్లించకుండానే పారిపోతున్నాడు. హారీ! వాణ్ని పట్టుకోరా," అని సిల్వర్ ఆజ్ఞాపించాడు.

హోటల్ నౌకరుగావును గబాలున వీధిలోకి పరిగెత్తాడు నల్లకుక్కను పట్టుకోడానికి.

"వాడు సాక్షాత్తు మహారాజైనా సరే, బిల్ చెల్లించితీరాలి. నాదగ్గిర ఈపప్పు లుడకవు," అని నాచెయ్యి వదిలిపెడుతూ అడిగాడు: "ఎవరన్నావు వాడు? నల్ల..."

"నల్లకుక్కండి. ట్రెలానీగారు మీతో చెప్ప లేదా, సముద్రపు దొంగల్నిగూర్చి? వాళ్లవాడే వాడు," అన్నాను.

"నిజంగా? ఓరి వీడి తస్సదియ్యా. నాహోటల్ కి రావడానికి వాడికెన్ని గుండెలున్నాయ్? బెన్! పరు గెత్తు నువ్వుకూడా వాణ్ని లాక్కురా. వాడు దొంగ అన్నమాట. వీడి తస్సదియ్యా. ఆదొంగతో కూర్చుని కబుర్లు చెబుతోంది ఎవరు? నువ్వేనా టామ్ మోర్గన్? ఇటురా."

మోర్గన్ అనబడే ఆమనిషి సిల్వర్ దగ్గిరికి తూలుకుంటూ వచ్చాడు. అతడు వృద్ధుడు; జుట్టు నెరిసింది; కళాసీ దుస్తుల్లో ఉన్నాడు.

"ఇదుగో మోర్గన్! నువ్వు ఇదివర కెవ్వడన్నా ఆనల్ల...నల్ల...నల్లకుక్కను చూశావా?" అని అడి గాడుసిల్వర్.

"లేదండి," అని భయపడుతూ చెప్పాడు మోర్గన్.

"వాడిపేరు తెలుసానీకు?"

"ఉహూ."

"తస్సదియ్యా, టామ్మోర్గన్! బతికి పోయావ్ ఇవ్వాల్టికి. అల్లాంటి వాళ్లతో నువ్వు మాట్లాడు తున్నావనిగాని, తిరుగుతున్నావనిగాని తెలిస్తే నిన్ని క్కడ అడుగు పెట్టనివ్వను తెలుసా. జాగ్రత్త. ఏమిటి వాడు చెబున్నాడునీతో?"

"నాకు తెలియదండి."

"తస్సదియ్యా. నీ మెడకాయ మీద వున్నది తలకాయేనా? నీతలకాయలో మెదడుందా? తెలియ దుట తెలియదు! నువ్విప్పుడెవరితో మాట్లాడు తున్నావో తెలుసా, పోనీ? ఇదుగో మోర్గన్! నిజం చెప్పు. ఏమిటానల్లకుక్క చెబుతున్నాడు నీతో? ఊ—"

"చుక్కాని పాడైపోతే బాగు చెయ్యటమెల్లాగో చెబుతున్నాడండి."

"తస్సదియ్యా. చుక్కానిగురించి చెబుతున్నాడేం? పోఫో. ఎదటలే, వెధవ మొహమేసుకుని."

మోర్గన్ మళ్లీ తూలుకుంటూపోయి తన బల్ల వద్ద కూర్చున్నాడు. సిల్వర్ ఇలా చెప్పసాగాడు:

"ఆ టామ్ మోర్గన్ఉన్నాడే. మంచివాడు, నమ్మదగినవాడు. కాకపోతే కొంచెం అమాయకుడనుకో. ఎవడో జ్ఞాపకం రావటంలేదే. నల్లకుక్కన్నావుగదూ? నల్ల...నల్ల...ఆ—ఇదివరకు చూసిన గుర్తుంది. అప్పుడప్పుడు ఒక గుడ్డివాడితో వచ్చే వాడిక్కడికి."

"రైట్. వాళ్లలో గుడ్డివాడు కూడా ఒకడుండేవాడు. వాడిపేరు ప్యూ," అన్నాను నేను.

"ఆ, ప్యూ, అంతే. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. వాణ్ణిచూస్తే చంటిపిల్లలు జడుసుకుంటారు కూడాను. ఇప్పుడా నల్లకుక్కగనక దొరికితే త్రెలానీగారు చాలా సంతోషిస్తారు. మా బెన్ బాగా పరిగెడతాడు. వాడితో పరిగెట్టేవాడు కళాసీల్లో ఎవడూ లేడు. ఈపాటికి పట్టుకునే వుండాలి నల్లకుక్కని తస్సదియ్యా. చుక్కాని ఎల్లాబాగుచెయ్యాలో చెబుతున్నాడేం ?"

ఈ మాట్లాడుతున్నంతసేపూ సిల్వర్ ఊతకర్రతో హోటల్లో అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ గెంతుతూ నడుస్తున్నాడు. నల్లకుక్క నిక్కడ చూడగానే మళ్లీ నాకు అనుమానాలు రేకెత్తాయి, సిల్వర్ అంటే నేననుకున్న కుంటివాడేమోనని. కాని సిల్వర్ ఇప్పుడు చేసిన గొడవంతా చూడగానే అనుమానాలు పటాపంచలయినాయి. నల్లకుక్కకోసం పరిగెత్తిన ఇద్దరూ మనుషులూ రొప్పుతూ, రోజుతూ తిరిగివచ్చారు. ఆ దొంగ గుంపులో కలిసిపోయాడనీ, ఎంత వెదికినా కనిపించలేదనీ చెప్పారు. సిల్వర్ వాళ్ల తెలివితక్కువతనానికి నానాతిట్లు తిట్టాడు. అప్పటికి నాకు సిల్వర్ అంటే సదభిప్రాయం పూర్తిగా కలిగింది. అంతకంటె ఘరానా మనిషి లేడనుకున్నాను. అతనిలాగన్నాడు :

"చూడు, హాకిన్స్! నాకెంత చిక్కువచ్చిపడిందో. అవతల త్రెలానీగారు ఇది తెలిస్తే ఏమనుకుంటారు చెప్పు. ఆ దొంగ ముండాకొడు కెవడో నాకు తెలియదాయెను. వాడు వచ్చి నాఇంట్లో, నా ఎదురుగా కూర్చుని, నా కళ్లల్లోనే కారంకొట్టిపోయాడాయెను. నువ్వువచ్చి వాడు ఫలానా అని చెప్పిందాకా. వాడెటువంటివాడో నాకు తెలియకపాయెను. ఇందులో నా తప్పేమున్నా వుందేమో చెప్పు. నువ్వు కళ్లారా చూశావుగదా. వాడు డబ్బు కూడా ఇవ్వకుండా పారిపోయాడు. హాకిన్స్! నువ్వు త్రెలానీ గారితో చెప్పాలి, నా తప్పేమీ లేదని. చెబుతావుగదూ? నువ్వు కుర్రాడివైనా తెలివితేటల్లో మా కెవరికీ తీసిపోవులే. అలాగని నిన్ను చూడగానే గ్రహించాను. ఇదుగో. పూర్వం నేను రెండుకాళ్ల మీద నడిచేటప్పుడు ఇలాంటిదో లెక్కలోకి వచ్చేది కాదు. వాణ్ణి రెండు నిమిషాల్లో నేనే పరిగెత్తి పట్టుకునేవాణ్ణి. తస్సదియ్యా. ఒక్కగుద్దులో గిద్దెడు రక్తం కక్కించేవాణ్ణి. ఆరోజులు పోయాయ్. అప్పటి బలమేదీ ఇప్పుడునాకు. హాకిన్స్! నువ్వూనేనూ స్నేహితులంగా ఉందామేం? ఓడలో కెక్కింతరవాత నీకు బోలెడు విషయాలు నేర్పుతాను. సరే. బయల్దేరుదాం పద. డ్యూటీఅంటే డ్యూటీయే. త్రెలానీ గారితో ఇప్పుడు జరిగినదంతా చెప్పాలి. ఎందుకంటే ఒక దొంగవెధవ ఇప్పుడు మనిద్దరినీ చవటదద్దమ్మల్ని చేసి పారిపోయాడు. ఆ, ఇద్దర్నీ దద్దమ్మల్ని—"

సిల్వర్ ఏదో జ్ఞాపకంవచ్చినట్లు ఆగాడు. జేబులు తడుముకుని, "అరె. వాడు డబ్బివ్వనే లేదు గదూ. చూశావా హాకిన్స్! నాకు డబ్బుసంగతి ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది—హ్హా—హ్హాహ్హా—" అంటూ నవ్వమొదలెట్టాడు. విపరీతంగా నవ్వాడు. నవ్వాపుకోలేక పక్కనున్న బల్లమీదపడి నవ్వసాగాడు. అతనన్నదాంట్లో నవ్వొచ్చే విషయం ఏముందో తెలియకపోయినా ఆనవ్వు నాక్కూడా అంటుకుంది. కళ్లనీళ్లువచ్చేవరకూ ఇద్దరం పగలబడి నవ్వాం.

చివరికి మా బసకు బయల్దేరాం. దోవలో సిల్వర్ ప్రతిఓడనుగురించి, అది ఏ దేశందో, దాని బరువెంతుంటుందో, దాని పేరేమిటో సవిస్తరంగా నాకు చెప్పాడు. ఏ ఓడలో ఏం చేస్తున్నారో, ఒకటి సరుకులు దించుకుంటోందనీ, ఒకటి సరుకులు ఎక్కించుకుంటోందనీ, మరొకటి లంగరెత్తి బయలుదేరు



తొందని, అన్నీ చెప్పాడు. మధ్యలో కళాసిలకథలు ఒకటి రెండు చెప్పాడు.

మేము బసచేరుకునే సరికి త్రెలానీగారు, లివ్ సేగారు సోఫాల్లో కూర్చుని ద్రాక్షరసం సేవిస్తున్నారు. ఓడను తనిఖీచేయడానికి బయలుదేరబోతున్నట్లున్నారు.

సిల్వర్ వారిద్దరికీ శాల్యూట్ చేసాడు. తన హోటల్లో జరిగిన విషయం యావత్తూ పూసగుచ్చినట్లు చెప్పాడు. మధ్య మధ్య "అంతేగదూ, హాకిన్స్," అని నన్ను కనుక్కున్నాడు. నేను అవునని తలఆడించి అతడు చెప్పిందాన్ని ధ్రువపరిచాను.

జమీాందారుగారు, డాక్టరుగారు నల్లకుక్క తప్పించుకు పోయినందుకు విచారించారు. సిల్వర్ "బోలెడు రమ్ము తాగి నాకు డబ్బు చెల్లించకుండా పోయాడండీ," అని మళ్ళీ పెద్దపెట్టున నవ్వసాగాడు. అతని నవ్వు అంటుజాడ్యం లాంటిది. అందులో హాస్యం ఉన్నా లేక పోయినా జమీాందారుగారు డాక్టరుగారు కూడా అందుకుని పగలబడి నవ్వారు.

తరవాత సిల్వర్ సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

"సాయంత్రం నాలుగింటికల్లా అందరూ ఓడలో హాజరుకావాలి," అని జమీాందారుగారు అతనికి కేక వేసి చెప్పారు.

"అల్లాగేనండి," అంటూ అతడు వెళ్ళిపోయాడు.

"త్రెలానీ! నువ్వు ఏపనీ సక్రమంగా చేస్తావని నాకు నమ్మకం లేదు. కాని సిల్వర్ ను మాత్రం మంచివాణ్ణే సంపాయించావు.

"ఫస్టుక్లాసయిన మనిషిలే. అంతకంటే సమర్థుడు మనకి దొరకడనుకో," అన్నారు జమీాందాగారు.

"ఇక వెడదాంపద. జిమ్ కూడా మనతో వస్తాడు."

"ఓ. తప్పకుండా. హాకిన్స్! నీ టోపీ తీసుకో. మన హిస్పానియోలాను చూద్దువుగాని," అన్నారు జమీాందారుగారు.

టోపీ తీసుకుని వారివెంట నడిచాను. బ్రిస్టల్ బజారు వీథులగుండాపోయి మా ఓడనిలిచిన హార్బరు చేరుకున్నాం.

(ఇంకావుంది)



టోపీతీసుకుని వారివెంటనడిచాను. బ్రిస్టల్ బజారులగుండాపోయి హార్బరుచేరుకున్నాం

అనగనగా ఒకవూళ్లో ఒక కాపు దంపతు లుండేవారు. ఆకాపుపేరు రామయ్య. అతని భార్యపేరు రంగమ్మ. రంగమ్మ చాలా గయ్యాళిమనిషి. రామయ్య కూడా రంగమ్మనోటికి దడుస్తూ వుండేవాడు. రంగమ్మకు ధనాశ చాలా యెక్కువ. పాపము, రామయ్య కష్టపడి ఎంతడబ్బు తెచ్చినా సంతృప్తిపడేది కాదు.

విదేశాలు వెడితే బాగా డబ్బు సంపాదించ వచ్చునని ఆమెవింది. దాంతో ఆమె భర్తను విదేశాలకు వెళ్ళి డబ్బు సంపాదించుకు రమ్మని పోరనారంభించింది. కాని రామయ్య కదేమీ యిష్టంలేదు. ఉన్న వూళ్లో నేవుండి కష్టపడి ఏదో నాలుగు

## "జారు"

రాళ్ళు సంపాదించుకొని కలో గంజో త్రాగితేచాలు లెమ్మను కొనే వాడు. చివరకు భార్యపోరు పడలేక ఒకరోజున బయలుదేరాడు. అయినా చేసేది దూరపు ప్రయాణంకదా అని భార్యను దారిలో తినేందుకేమైనా చేసిమ్మని అడిగాడు. రంగమ్మ ఆలోచించింది. ఏమి చెయ్యాలో, డబ్బు ఖర్చు కాకుండానని. చివరికామె ఎన్నాళ్ళబట్టో ఏమి చెయ్యాలో తెలియక అట్టిపెట్టిన నులినూకలు తీసి రుబ్బి పెనంమీద అట్లుపోసింది. అవి పాతిక మూటకట్టి "ఇందులో యాభైఅట్లు మూటకట్టాను. నాలుగట్లు తింటేచాలు. కడుపు నిండుతుంది. రోజూ రెండుసార్లు తిను. ఒకవారం రోజులికి సరిపోతాయి. తరవాత, వెళ్లేదార్లో వూళ్ళుంటాయి కదా! ఏఅమ్మ నడిగినా నాలుగు ముద్దలు పెట్టకపోదు. అంతేకాని పూటకూళ్ళింటికి పోయేవు. ఆపని మాత్రంచేయకు. డబ్బు దండుగ" అనిచెప్పి రామయ్యను ప్రయాణానికి సిద్ధంచేసింది.

రామయ్య 'ఎందు కొచ్చిందిరా బాబూ! ఈ ప్రయాణం' అనుకుంటూ వెళ్ళలేక వెళ్ళలేక వెళ్లాడు. ఆరోజంతా నడిచి చీకటి పడేవేళకు ఒకవూరు చేరాడు. నడిచి, నడిచి వున్నాడేమో బలే ఆకలౌతోంది. సరే భార్యకట్టిచ్చిన అట్లున్నాయి కదా, తిందామని మూటవిప్పాడు. అతనికి ఆశ్చర్యం వేసింది. ఏభై అట్లున్న బొంతర ఇంత యత్తైనా వుండవలసిందని. దాంతో లెక్కపెట్టాడు. పాతికేవున్నాయి. ఒళ్ళు మండిపోయింది రామయ్యకి. పాడు డబ్బుకోసమనికాని వూర్లన్నీ తిరగమంటమే కాకుండా కడుపుకూడా మాడుస్తోందేలని. అయినా, పాపమప్పుడేం చేస్తాడు. సరే ఆవున్న అట్లలో కొన్నయినా తిందామని ఒకఅట్టుతీసి నోట్లోపెట్టుకొన్నాడు. మట్టినూకలతో చేసినఅట్లుగా అవి. నాలుగుసార్లు నమిలేసరికి దవడలతుక్కుపోయాయి. రామయ్యకరికాలు మంట నెత్తికెక్కింది. అసలే ఆకలౌతోంది. అందులో యేభైవుంటా యనుకున్న అట్లు పాతికే వున్నాయి. పైగా ఆవున్నవైనా బాగా వున్నాయా అంటే, మనుష్యులు తినదగ్గవిగా లేవు. బుద్ధి తక్కువైందిరా మామయ్య కూతురుకదాఅని దీన్ని

చేసుకోవటమనుకొని, నోట్లో నీళ్ళు పోసుకొని పుక్కిలించి వుమ్మేశాడు. సరే, ఆపూటకి ఆకలితీరాలి కనుక నడుంకు కట్టుకున్న మూటలోని చిల్లరతీసుకొని ఆవూర్లోవున్న పూట కూళ్ళింటికి వెళ్ళి కడుపునిండా భోం చేశాడు.

ఆ రాత్రికి అక్కడే అరుగుపై పడుకొని మర్నాడుదయం, యేమైతే అదయిందనుకొని ఇంటి కేసి బయలుదేరాడు. మధ్యాహ్నం భోజనం వేళకల్లా ఇల్లు చేరుకొన్నాడు. రంగమ్మ అప్పుడే అన్నంతిని కంచం కడుక్కుంటోంది. రామయ్య అప్పుడే రావటము చూసేసరికి ఆమెకు వళ్ళు మండి పోయింది. డబ్బు సంపాదించుకు రమ్మని విదేశాలకు పంపట మేమిటి? అతగాడప్పుడే, మొన్నాటికే తిరిగిరావట మేమిటి? అయినా యేమైందోఅని, ఆ కడిగే కడిగే కంచం తీసుకునుల్చొని "ఏం! అప్పుడేవచ్చావ్. ఇక్కడేం పాతేసి వెళ్ళావేంటి?" అని అడిగింది. "నేను వెళ్ళ దలుచుకోలేదు" అన్నాడు రామయ్య తెగించి. "ఆ యేమిటీ! వెళ్ళదలుచుకో లేదూ?" అంటూ రంగమ్మ ఆకంచంలోనున్న అంటు నీళ్ళన్నీ రామయ్యముఖాన కొట్టింది. ఆ కాసినినీళ్ళూ ముఖంమీద పడే సరికి రామయ్య తెగింపు కాస్తా పోయింది. దాంతో గజ గజ లాడుతూ రామయ్యజరిగిన విషయ మంతా చెప్పాడు. దాంతో ఆమె "ఆ! యేమిటీ! అట్లు బాగుల్లేదని ప్రయాణంమానేసి తిరిగొచ్చావ్!!" అంటూ అతని ననేక విధాలుగా దూషించి చివరకు భోజనంకూడా పెట్టకుండా అప్పటి కప్పుడే భర్తను మళ్ళా ప్రయాణం కట్టించింది.

ఈసారి రామయ్య నానా యాతనా పడుతూ నలభై మజిలీల దూరం ప్రయాణంచేశాడు తనఇంటి వద్దనుండి. ఒకరోజు మధ్యాహ్నం ఎర్రటి యెండలో ప్రయాణంచేస్తున్నాడు. అతని కధికంగా దాహ మైంది. ఎక్కడచూచినా నీళ్ళు లేవు. చివరి కతనికొక చిన్నతోటలాంటిది కనపడింది. తడారిపోతున్న గొంతుకను నీటితో తడుపు కుందామనే ఆశతో రామయ్య దానిదిక్కే గబ గబా నడిచాడు. అదొక చిన్న తోట. వివిధమైన ఫలవృక్షాల తోనూ నిండివున్న ఆతోట నడుమ ఒకపెద్దబావి చూచాడు రామయ్య. దాంతో అతనికి ప్రాణంలేచి వచ్చి నట్లయింది. గబగబా అక్కడున్న బొక్కెనతో నీళ్ళు తోడుకున్నాడు. చెట్లనీడలోవుందా బావి. అందువల్ల ఆనీరు చల్లగావుంది. అదీకాకుండా మనరామయ్య బాగా యెండలో నడిచి మంచి దాహంతో వచ్చాడేమో! ఆనీళ్లు త్రాగేసరికి పోయే ప్రాణం లేచివచ్చినట్లయింది. కడుపు నిండా ఆనీళ్ళుత్రాగి అక్కడున్న ఒక గున్నమామిడి చెట్టుక్రింద నడుంవాల్చాడు.



ఇంతలో కావిడి బుజానేసుకొని నీళ్ళ కోసమో మనిషక్కడి[illegible]చ్చాడు. అతనువచ్చి నీళ్ళు తోడుకుంటూ, చెట్టుక్రిందున్న మన రామయ్యను చూచి ‘ఏవూర్నుంచి బాబూ, రావటం?’ అని అడిగాడు. అందుకు ‘అబ్బో, నలభై మజిలీలు చేసి నేనిక్కడికి జేరాను. చాలా దూరాన్నుంచే వస్తున్నానయ్యా,’ అన్నాడు రామయ్య. “అయితే నువ్వుగాని, నీభార్యగాని ఇంతకు ముందెప్పుడూ ఇటుకేసి రాలేదా?” అని అడిగాడామనిషి. “అబ్బే, ఎప్పుడూ, ఎవరమూ రాలేదు. నేనైనా ఇదే మొదటిసారి రావటం. ఇప్పుడేవచ్చి దాహం తీర్చుకొని ఇక్కడ కూర్చున్నాను. ఏం? ఎందుకు?” అన్న రామయ్య మాటలకు ఆకావిడిమనిషి “అయితేనువ్వు చాలా అదృష్టవంతుడివి.” “ఏం! ఎందుకని?”

“భార్యాభర్తల్లో ఎవరైతేముందీ బావినీరు త్రాగుతారో వారికి రెండవవారు ఎప్పుడూ సేవచేస్తూ వుంటారు. ఇదొక దేవకన్యవరం.” దాంతో రామయ్యముఖం విప్పారింది, తన భార్యపోరు ఇకవదలిపోతుందికదా, అని. అంతకుముందే కడుపునిండా త్రాగినా, మళ్ళీ గబగబాలేచి ఆక్రొత్తమనిషి తోడుకొన్న కడవలోని నీటిని త్రాగ గలిగినన్ని త్రాగి, సంతృప్తితో “అయితే నువ్వే నీ భార్యకంటే ముందు త్రాగుంటావు. కదూ!” అన్నాడు. అందుకా కావిడిమనిషి కొద్దిగా నవ్వి “అబ్బే, అట్లాఅయితే ఇప్పుడే మండు టెండలో ఈకావిడి బుజానేసుకొని ఇక్కడికెందుకొస్తాను?... నాభార్య నాకంటే చాలా తెలివిగలది. మా పెళ్ళి వూర్లోనే అయిందిలే. నేను దాని మెళ్ళోపుస్తి కట్టంగానే, ఈబావికేసి పరుగెత్తాను. నాభార్య నాకంటె తెలివైనదని చెప్పాను కదూ! ఆమె అంతకు ముందే ఈనీటిని ఒకచెంబులో తన ప్రక్కనే పెట్టుకుంది. నేను పరుగెత్తేసరికి ఆమె పకపకా నవ్వుతూ, ఆచెంబులోని నీరు గబగబా త్రాగేసింది. ఇంకేముంది! దాంతో నేను పగలనక, రాత్రనక రోజల్లా ఆమె చెప్పినట్లల్లా చేయాల్సొస్తోంది” అని దిగాల్తో చెప్పాడు.

రామయ్య ఆతని విషయంవిని కొద్దిగా విచారించినా, మళ్ళా తన విషయం గుర్తుకొచ్చి గబగబాలేచి ఆతనితో తానిక వెడుతున్నానని చెప్పి, మళ్ళీ తనింటికేసి బయల్దేరాడు. ఇప్పుడు సంతోషంతో ప్రయాణం చేస్తున్నాడుగా. పదిహేను మజిలీల్తోనే ఇల్లు చేరుకొన్నాడు.

ఆశ్చర్యం. తన్ను గుమ్మంలోచూసేసరికల్లా రంగమ్మ గబగబా చెంబుతో నీళ్లు తీసుకొచ్చి, ఇచ్చింది. కాళ్ళు కడుక్కొని కూర్చునే టప్పటికి తన పమిటచెంగుతో కాళ్ళు తుడిచి, గబగబా వంటచేసి భర్తకుపెట్టి తరువాత తానుతింది. రామయ్య వచ్చి అప్పుడే పదిహేనురోజులవుతోంది. రంగమ్మ అంతవరకూ భర్తమీదే విధంగానూ నోరుచేసుకోకపోవటమే కాకుండా, ఆతని అడుగులికి మడుగులొత్తటం చూసి, ఇరుగుపొరుగు వారంతా ‘ఈతారుమారేమిటా’ అని ఆశ్చర్యపోయారు. ★

# ★ దసరా ★

ఊరిమధ్యగా కాలువ. కాలువకు రెండుపక్కలా విశాలమైన రాజబాటలు. ఆబాటల పొడుగునా పెద్దపెద్ద చెట్లు. ఇటు రోడ్డు. మీదికీ అటు కాలవలోకీ ఆచెట్లు కొమ్మలు విస్తరించుకొని రోడ్ల పొడుగునా చలివేంద్ర పందిళ్ళు వేసినట్లు చల్లనినీడా చల్లనిగాలీ ఇస్తూ ఉండేవి. ఇప్పుడు ఆ ఊరు ఎంత అధ్వాన్నంగా ఉన్నా అప్పటి రోజుల్లో చూస్తే అంత హాయైన ఊరు ఉండేది కాదనిపించేది.

కాలవఒడ్డునే, చిన్న పెంకుటిల్లు. ఆనాటికీ ఈనాటికీ ఉంది పిల్లలబడి. ఇప్పుడేవో గవర్నమెంటు పరీక్షల క్లాసులదాకా ఉన్నాయి ఆబడిలో. అప్పటికి మాత్రం చిన్నబాలశిక్ష, పెద్దబాలశిక్ష, మూడో తరగతి నాల్గోతరగతిదాకా ఉండేవి. ఎలిమెంటరీ స్కూలుఅని పేరు. తాలుకాబోర్డు ఆధ్వర్యము అప్పుడప్పుడే ఆబడికి వస్తున్నది. అంతవరకూ ముసిలిపంతులు వీధిబడి అనేపేరు. అప్పటికి బడికిముందు కాంపౌండు గోడకూడా ఉండేదికాదు. వరడాం అరుగులు రోడ్డుకు తగులుతూ, నదీకాలవలో పడవల రహదారీ, కాలవకు వచ్చేపోయే స్నానాల జనం సందడి, అన్నీ పిల్లల ఎక్కాల అప్పగింతతోడు కలిపి పాడుతూన్నట్లే కోలాహలంగా ఉండేది.

ఆస్కూల్లో పెద్ద పంతులు సోమయ్యగారు. ఆయన చాలా నెమ్మదస్థుడు. పిల్లలను కోప్పడినట్టే కనబడేవాడుకాదు. అసలు బడిలో కల్లా సింహంలా ఉండే పంతులు ముసిలిమాస్టారు. ముసిలి మాస్టారన్న పేరేగాని ఆయన పిల్లలకు ఏమంత ముసిలివాడుగా కనబడేవాడు కాదు. ఆ యీడున చూస్తే ఆరడుగులకన్నా ఎత్తుగా ఉండేటట్టు కనబడేవాడు. మంచి దబ్బపండు చాయ. భారీబళ్ళు. గండ్రబారిన మొహం. బ్రహ్మరాకుసుడులా ఉండేవాడు. బ్రహ్మచారి ఆయన బడిలో కేకవేస్తే, కాలవదాటి అగ్రహారందాటి, కోటలో పెద్ద స్కూలు పిల్లలు కూడా గడగడలాడేట్టుండేది. పేటలో చివరి ఇంటి దగ్గర ఉన్న కుఱ్ఱవాడిక్కూడా ముసిలి పంతుల కేక ఇంటిదాకే తరిమి హడలగొడ్తున్నట్టుండేది. కాని ముసిలిపంతులు చీపురుపుల్లతో కూడా పిల్లలను ఎప్పుడూ కొట్టనేలేదు. మూడో మాస్టరు సాయెబు మాస్టరు. ముసిలిపంతులుధాటి కాగని పసిపిల్లలకు సాయిబ్బు మాస్టారే జంటపదాలదాకా చెప్పేవాడు. ఆతర్వాత ముసిలిమాస్టారు క్లాసు. అది రెండో క్లాసో, రెండో ఫారమో, కాలేజీలో రెండో ఇయరో, అన్నిటికలగలుపో ఆయన చెప్పేపాఠాలనుబట్టి తెలుసుకోటం కష్టం. బడి తెరిచిన ఇరవై రోజులలోపల ఇరవై ఇరవైలదాకా ఎక్కాలన్నీ తలక్రిందులుగా ఒప్పచెప్పటమే కాకుండా ఏ హెచ్చవేత కాహెచ్చవేత తడుముకోకుండా చెప్పవలసిందే. రూపాయి అణాల భాగారం, బజారుబిల్లులు. కత్తిరవడ్డీ, అన్నిమాదుర్లు మొదటి మూడునెలల్లో అయిపోయేవి. వేమనపద్యాలు, సుమతిశతకం పద్యాలు, శ్రావణ శుక్రవారాలు పూర్తి అయేలోపల వచ్చేసేవి. ఇంక అప్పటినుంచి దసరా పద్యాలు మోతలెక్కిపోయేవి. భాద్రపదమాసం ఆఖరయేటప్పటికి "ధరసింహాసనమై" మొదలుకొని కోలాటం కీర్తనలదాకా అందరికీ వచ్చేసేవి. అథమం అందరూ కలిసి గట్టిగా చదువుతోంటే రానివాడికి నోరువెల్లా మెదుపుతూ కూర్చోవాలో ఐనా తెలిసేది.

అమావాస్యకు ముందే ముసిలిపంతులు అందరికీ చెప్పేసేవాడు అంటే ఆయన ఒక్కసారి కేకవేస్తే

అందరికీ చెప్పేసినట్టే. "ఒరేయ్, విదియనాడు గుళ్ళల్లోకి వెళ్ళాలి. ప్రొద్దున్నే అంతా తలంటుపోసుకొని కొత్తబట్టలు కట్టకొని, బడికి వచ్చి అన్నీ అప్పచెప్పాలి. ఒక్కొక్క కొబ్బరికాయా, కానీ కానీ తీసుకొని మళ్లీ మధ్యాహ్నం మూడింటి కల్లా బడికి రావాలి తెలిసిందా? మళ్లీ చెప్పను జాగ్రత్త," అని ఒక్క కేకేసేవాడు: ఇంటిదగ్గర ఓకట్టాన తలంటిపోసుకోని పిల్లలు కూడా ఆవేళ ఏం మారాం చెయ్యకుండానే నోరు మూసికొని తలంట్లు పోసికొనేవాళ్లు. అమ్మా వాళ్ళు కోప్పడక్కర్లేకుండానే తలంటిపోసుకొన్నట్లు మేష్టరికి తెలిసేందుకు నానాయాతనా పడేవారు.

అవాళగుడికి తీసుకెళ్లటం పంతులు ముసిలి మాష్టారిదే. సోమయ్యగారూ సాయబ్బ మాస్టారూ కూడా వచ్చేవారు గాని పిల్లలను మాష్టార్ని గుడిదగ్గిర వదలిపెట్టి, పిల్లల తండ్రులను మంచిమాటగా కలుసుకొనేందుకుమళ్లీ పిల్లల ఇళ్లకుతీసికెళ్లేవారు.

అప్పటికే ప్రతి పిల్లవాడికి ఒక రంగురంగుల విల్లంబు, ఒక బుర్రా-గొట్టం, జతకోలాటంకఱ్ఱలు, ఆంజనేయులుబొమ్మా ఉండేవి. ఆంజనేయులుబొమ్మను తాడులాగి ఎగిరించటంలోకూడా, బొమ్మ చెడినకొద్దీ పిల్లవాళ్ళ ప్రజ్ఞ తెలివితేటలూ ఎక్కువవుతూ ఉండేవి. గుళ్ళోకి పోగానే, ముసిలి పంతులు ఒక పెద్ద పిల్లవాడిని ముందు నిలబెట్టేవాడు. ముగ్గురు నలుగురు వరుసగా పిల్లలంతా పది గజాల బారున నిలబడేవారు. ఆరుచివర ఐదారేళ్ల పిల్లలంతా ఉండేవారు. వాళ్ల వెనకాతల వెయ్యికళ్లతో వాళ్లని కనిపెట్టూ, ముందరిపిల్లలు తప్పులు రాకుండా పద్యాలు చదివేందుకు కేకలేస్తూ ముసిలి పంతులు ఉండేవాడు. గుళ్లోకి వెళ్ళగానే, పద్యాలు పెద్ద పిల్లవాడు అందిస్తూ తక్కినవాళ్ళు అంతా అదేమాట ఏకకంఠంతో చదువుతూ ప్రాకారంలో మూడు ప్రదక్షిణాలూ పూర్తిచేసేవారు. తరువాత ముసిలి పంతులు గుడి అరుగెక్కి గర్భగుడికి ఇవతలగా నిలబడి పసిపిల్లలను తనచుట్టూ పెట్టుకొని పెద్ద పిల్లలు వాళ్ళచుట్టూ చక్రం కట్టగా మధ్య నిలబడేవాడు. అప్పుడు గణపతిప్రార్థన సరస్వతి ప్రార్థన అయాక "ధరసింహాసనమై," అని పెద్ద పిల్లవాడు పద్యం అందుకొనేవాడు. అంతా "ధరసింహాసనమై, "అని గుడి ఎగిరిపోయేట్టు అరిచేవారు. "నభంబు గొడుగై—తద్దేవతల్ భృత్యులై పరమామ్నాయములెల్ల వంది గణమై - బ్రహ్మాండమాకారమై - సిరిభార్యామణియై-విరించి కొడుకై - శ్రీగంగ సత్పుత్రియై - వరుసన్ నీ ఘనరాజసంబు - వసుధన్ - వర్థిల్లు నారాయణా -" అని పద్యం పూర్తి అయేది. అప్పుడు "శ్రీ పార్వతీ పుత్ర- శృంగారగాత్ర" మొదలెట్టేవారు. "జయా విజయీ భవా-దిగ్విజయీ భవా" అని పూర్తి అయాక ముసిలి పంతులు పిల్లల్ని వరుసగా పిలిచి కొబ్బరికాయ లిమ్మనేవాడు. ఆ కొబ్బరికాయ లియ్యటానికి వెళ్లినప్పుడుమాత్రమే పిల్లలకు అమ్మవారి విగ్రహం కనబడేది. ఆవిడ కిరీటం చేతులో ఆయుధాలు కాళ్ల కింద రాక్షసుడూ రూపం అంతా చాలా భయంకరంగానే ఉండేది. కాని కళ్లు మాత్రం వెండి బంగారాలతో తళతళలాడుతూ నవ్వుతూన్నట్టే ఉండేది. పూజారి కొబ్బరికాయలన్నీ కొట్టాక పంతులు మళ్లీ ప్రతి కుఱ్ఱవాడికి సగం కొబ్బరిచిప్ప వెనక్కి ఇచ్చేవాడు. తక్కిన కొబ్బరి చిప్పలు పూజారులు తరిగి సెనగపప్పు మరమరాలు బెల్లం, అన్నిటితో కలిపి పెద్ద పళ్లాలలో పోసేవారు. పిల్లలందరికీ ముసిలి పంతులేపంచిపెట్టేవాడు. అందరూతినేసి

చేతులు లాగూలకు తుడిచేసుకొని లేచేవాళ్లు - అక్కడే గుడిలోనే ఒక జడ కోలాటం ప్రతి దసరాకి కట్టించేవాళ్లు. పైన ఒక కొక్కెం నుంచి, ఏడు రంగురంగుల దారాలు పేనిన తాళ్లు క్రిందదాకా వేలాడుతూ ఉండేవి. కోలాటం నేర్చుకొన్న ఏడుగురు పిల్లలు ఏడు తాళ్ల చివరలు పుచ్చుకుని కోలాటం కట్టలు వాయిస్తూ, తాళ్లు క్రింద దాక అల్లుకొంటూ వచ్చేదాకా, గుండ్రంగానూ అడ్డంగానూ ఇటు నుంచి అటూ, ఒకళ్లను దాటి ఒకళ్లూ ఇల్లా అడుగులు వేసుకొంటూ నడిచేవాళ్లు. పిల్లలంతా కలిసి "శ్రీరఘురాముని సీతిచరిత్రము ఖ్యాతిగ వినరన్నా" అన్న పాట పాడేవాళ్లు. ఆ రంగుల తాళ్లన్నీ క్రిందదాకా పేనుకొని మళ్లీ పురి విప్పుకొంటూ పైకి పోయేదాకా ఉండేదిఆ పాట. అక్కడినుంచి దక్షిణవీధి గుళ్లూ, పడమటివీధి గుళ్లూ, పేరయ్యకోనేటి గుడీ, జనార్దనస్వామి ఆలయం. వాసు దేవాలయం ఇన్నీ తిరుగుకొంటూ బయలుదేరేవారు పిల్లలూ పంతులూ. ముసిలిపంతులు పసి పిల్లలనందర్నీ వాళ్ల వాళ్ల ఇళ్లదగ్గర దిగబెట్టి, బడిదగ్గరకు వచ్చాక పెద్ద పిల్లలనందర్నీ పొమ్మనేవాడు.



మర్నాడునుంచే, పిల్లల ఇళ్ళకు దండులు బయలుదేరేవారు. ఇళ్లకు బయలుదేరేటప్పుడు చాలామటుకు సోమయ్యగారూ, సాయబ్బ మాస్టారే పిల్లలవెంట వెళ్ళేవారు. పిల్లలతండ్రులతో కొంచెం నెమ్మదిగా బెల్లింపుగా మాట్లాడటం ముసిలిమాస్టారుకు చేతకాదు. ఆయన అగుస్తే, పిల్లల తండ్రులకు కూడా భయంగానే ఉండేది. కాని పూర్వీకపు తలిదండ్రులు ముసిలి పంతులతో పిల్లలు కలిసివస్తేనేముచ్చటగా ఉండేది. ఆయన దృష్టి ఇంటి యజమానులదగ్గిర డబ్బు వడకిటంమీద ఉండేదికాదు. తనతోవచ్చిన పిల్లలందర్నీ సమంగా చూశారా లేదా అని ఉండేది. ఆయన వెళ్తే పంతుళ్లు పంచుకునేందుకు కూడా చాలినంత డబ్బు రాదని సామాన్యంగా లౌక్యుడైన సోమయ్యగారే, లౌక్యంగా పెద్ద షావుకారుల ఇళ్లకు తనే పిల్లల్ని వెంటబెట్టుకొని వెళ్ళేవాడు. కానీ ఒక్క గమ్మత్తుండేది. ఊళ్ళో అందరికన్నా భాగ్యవంతులు ఒకరిద్దరూ, ముసిలి పంతులు వస్తే మహా గౌరవం చేసేవారు. ఆయన డబ్బుమాటే ఎత్తేవాడు కాదు. పిల్లలందరిచేతా ఘంటసేపయినా పద్యాలూ పాటలూ అన్నీ తప్పులు లేకుండా అదరగొట్టి చదివించేవాడు. ఆ ఘంటసేపూ పిల్లల కెల్లా ఉన్నా అక్కడున్న పెద్దలకు మహా సంతోషంగా ఉండేది. కాని ముసిలి పంతులు డబ్బుమాట ఎత్తేవాడు కాదు. ఆయనకు డబ్బున్నదని ఆ పెద్దలమీద ప్రత్యేకగౌరవం ఏమీ ఉండేదే కాదు. అందుకనేనేమో, ఎవళ్లకూ కానీ రాల్చని ఆ పెద్దలంతా అడలుతూ పంతులుకు పాతికలూ ఏభైలూ నసుగుకొంటూ బ్రతిమాలుకొంటూ ఇచ్చేవాళ్లు. ముసిలిపంతులు పెద్ద ఇళ్ళతోపాటు గుడిసెలకుకూడా పిల్లలను తీసుకెళ్లేవాడు.

ఆయన పిల్లలతో వెళ్తూన్నప్పుడు పదిరోజులూ పగటివేషాలు వేసే సున్నం వీరయ్యకూడా వేషం మధ్యలోనే పంతులుగారికి నమస్కరించేవాడు. పంతులు పిల్లల నక్కడ నిలవేసి, వీరయ్య గొల్లపడుచు హాస్యం, గొల్లవాడి హాస్యం, భామకలాపం, ఇల్లాటిప్రతీ వేషం పూర్తిగా పిల్లలను చూడనిచ్చి, వీరయ్యను ఆశీర్వదించేవాడు. అతని హాస్యం నెమరువేసుకొంటూ ఒక్క పెద్ద నవ్వు నవ్వి "వీరయ్యా! శక్తి వేషంతో మా పిల్లలనుమాత్రం ఝడిపించకు" అని అనేవాడు. నిజానికి వీరయ్య "శక్తివేషం" పిల్లలు చూస్తే ఝడుసుకోవలసిందే! కాని ముసిలిపంతుల కలవాటుపడ్డ పిల్లలను ఏ శక్తివేషమూ ఝడిపించలేదు. ఆ దసరా పండుగలు అల్లా ఉత్సాహంగా జరిగేవి. ఆతర్వాత తాలూకాబోర్డులు తెలివిమీరాక ముసిలి మాష్టరుకి హిస్టరీ జాగ్రఫీ రావని ఉద్యోగంతీసేశారు.

# సినిమా చిత్రాల సెన్సారు



ప్రస్తుతం జరిగే సినిమా చిత్రాల సెన్సార్ విధానం చిత్ర నిర్మాతలకు చాలా అసంతృప్తికరంగా ఉంటున్నట్టు స్పష్టమవుతున్నది. ప్రభుత్వ కేంద్ర సినిమా బోర్డు తరఫున అగర్వాలా మద్రాసుకు వచ్చినప్పుడు మద్రాసులోని తమిళ తెలుగు చిత్ర నిర్మాతలలో చాలా మంది ఆయనను కలుసుకొని ఈ నాడు అమలులో ఉన్న సెన్సార్ కోడ్ గురించి చాలా మొర పెట్టుకొన్నారట. త్వరలోనే కలకత్తాలో ఒక సమావేశం జరిగి పక్కాగా ఫిలిం కోడ్ తయారు చేస్తారు. అంతదాకా చిత్తుకోడ్ అమలులో ఉంటుంది.

సినిమా సెన్సార్ విషయం కేంద్ర ప్రభుత్వం జోక్యం కలిగించుకోక పూర్వం వివిధరాష్ట్రాలలో—చిత్రనిర్మాణం జరిగే బెంగాలు, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో—వేర్వేరు సెన్సార్ బోర్డు లుండేవి. ఇందువల్ల సెన్సార్ విధాన ప్రమాణాలలో హెచ్చుతగ్గులుంటున్నాయనీ, దేశమంతటా ఒకే ప్రమాణంలో సినిమా చిత్రాల సెన్సార్ జరగటానికి కేంద్రప్రభుత్వం కొన్ని ఏర్పాట్లు చేసింది.

ఈ కొత్త ఏర్పాటు ప్రారంభమయాక మద్రాసులో 80 చిత్రాలకు పైగా సెన్సార్ అయినాయి. ఇందులో ఒక్కటి కూడా సెన్సార్ కత్తెరనుండి తప్పించుకోలేదు. చాలా ఏళ్లుగా సినిమా రంగంలో ఉన్న వాళ్లకిది విడ్డూరంగా కనిపించటంలో ఆశ్చర్యం లేదు. ఎందుచేతనంటే పూర్వం సెన్సార్ కత్తెరకు చిత్రం గురి కావటమంటే చాలా విడ్డూరంగా ఉండేది. తమ చిత్రంలో ప్రజలు చూడరానివీ, వినరానివీ ఉన్నాయనిపించుకోవటం చిత్రనిర్మాతలకు చాలా అవమానంగా ఉండేది. కాని ఇప్పుడు సెన్సార్ కత్తెరను తప్పించుకోవటం దాదాపు అసాధ్యంగా ఉంటున్నది. "ఇది ఎందువల్ల?" అని చిత్ర నిర్మాతలు అడుగుతున్నారు. సెన్సార్ నియమాలు చాలా క్లిష్టంగా ఉన్నాయని అయినా అనుకోవాలి, లేదా చిత్రనిర్మాతలకు కొత్తగా నైతికదృష్టి లేకుండా పోయిందని అయినా అనుకోవాలి.

వాస్తవం చూసినట్టయితే రెండూ కొంత కొంత సత్యంగా కనిపిస్తుంది. ఇప్పటి సెన్సారు అధికారులు కొత్తగా తమ సీటు చూసి తామే భయపడుతున్న వారల్లే ప్రవర్తిస్తున్నారు. వారి మనస్తత్వంలో ఔదార్యం బదులు రహస్య పరిశోధకుల ధోరణి హెచ్చుగా కనిపిస్తున్నది. తమకు తప్ప చిత్ర నిర్మాతలకు గాని, ప్రేక్షకులకుగాని "డీసెన్సీ" అనేది లేదన్నట్టుగా వీరు ప్రవర్తిస్తున్నారు. కొన్నిచోట్ల సినిమా ప్రేక్ష



భారత్ లక్ష్మీవారి "ప్రియురాలు"లో "మోహిని" లక్ష్మీకాంత

కులను అపాయకరమైన సినిమా చిత్రాల నుంచి శ్రద్ధగా కాపాడే భారాన్ని దేవుడు తమమీద వేసినట్టుగా వీరు ప్రవర్తించటం జుగుప్సాకరంగా ఉంటున్నది.

అయితే చిత్రనిర్మాతలు బుద్ధిమంతులవటానికి వీలులేదు. నేటి చిత్ర నిర్మాతలలో చాలా మంది పూర్వకాలపు చిత్రనిర్మాతల వంటివారు కారు. వెనక చిత్ర నిర్మాతలకు కళా విషయకమైన ఆత్మగౌరవం ఉండేది. వారు చిత్ర నిర్మాణం ఆమూలాగ్రం తెలిసి, చిత్రం నిర్మించేవారి నందర్నీ-డైరెక్టరుతో సహా-నడిపించగలిగేవారు. కాని ఆతరం చిత్ర నిర్మాతలిప్పుడు చాలావరకు వెనకపడిపోయి, ఇప్పుడు కేవలం వ్యాపార సంబంధాలను పురస్కరించుకుని చిత్ర నిర్మాతలుగా రంగంలోకి వస్తున్నారు. వీరిలో చాలా మందికి వ్యాపారదృష్టి తప్ప సినిమా కళతో ఇంకెట్టి సంబంధమూ లేదు. ఈ నిర్మాతలకు కావలసింది గొప్ప చిత్రం తీశామన్న ఖ్యాతి సంపాదించటం కాదు; చాలా డబ్బు గడించిన చిత్రం తీశామనిపించుకోవటం. డబ్బు గడించే ఈ ప్రయత్నంలో చాలా మంది చిత్రనిర్మాతలు వీలయినప్పుడల్లా తమ తారల వక్షోజాలు ప్రదర్శించటమూ, అశ్లీల గర్భితమైన సంభాషణలు రాయించటమూ, ప్రేక్షకులకు రసానుభూతి నివ్వటానికి బదులు ఉద్రేకాన్ని-భయం, నవ్వు, దుఃఖం మొదలైనవి-కలిగించటానికి యత్నించటమూ చేస్తున్నారు.

అయినప్పటికీ ఇటువంటి ప్రయత్నాన్నీ సెన్సార్ బోర్డ్ వారు పురుగెరటంలో ఔదార్యం లేదు. ఈ చిత్ర నిర్మాతలు డబ్బుకోసం పడేపాట్లు చూసి జుగుప్స చెందే అవకాశం ప్రేక్షకుల కివ్వవచ్చు. వాళ్లు నోట్లో వేలుపెడితే కొరకలేని చంటిపిల్లలనుకోవటంలో అర్థం కనపడదు. చిత్ర నిర్మాణంలో ప్రవేశించే ఇటువంటి కుళ్లును ఖండించటానికి తగిన విమర్శకులూ, సంఘశక్తులూ, ప్రజాభిరుచీ, ఉత్తమ చిత్రనిర్మాతల ఉత్తమ చిత్రాలూ, లేవనుకోవటం ఒక తప్పు. సర్వతోముఖంగా జరగవలసిన ఈ సాంఘిక కలాపాన్ని సెన్సార్ బోర్డులోని సభ్యులు తమ భుజస్కంధాల మీద వేసుకోవటం మరొక తప్పు.

అదీకాక, ఒక ప్రసిద్ధ చిత్ర నిర్మాత చెప్పినట్టు, ప్రస్తుత సెన్సార్ విధానం అతి ముఖ్యమైన కళాప్రయోజనాన్ని గాలికి వదిలి నలుసు ఏరుతున్నది. ఏ స్త్రీ పాత్రకైనా ఎక్కడైనా పొరపాటున పమిట తొలిగిందా, "హారతి" అన్నమాట "రతి" అన్నది ధ్వనించటానికి పెట్టారా—ఈ ధోరణిలో చిత్రాన్ని పరిశీలించే సెన్సార్ బోర్డ్ వారు "ఈ చిత్రంయొక్క ఆశయం జాతిని ఉత్తేజ పరచటము కాదా?" అన్న విషయం చూడకుండా ఉన్నారు. ప్రజలను నిర్వీర్యపరచినా ఉత్తేజపరచినా చిత్రంయొక్క సందేశమే ఆపని చేయాలిగాని వ్యంగ్యంగా ప్రవేశపెట్టిన అశ్లీలాలు అతే బాధించవు. దీనితో బాటు గమనించవలసిన మరొక సత్యమేమిటంటే, ఎంతవ్యంగ్యంగా అశ్లీలాలు పెట్టినా ప్రేక్షకులు కనిపెట్టగలరు గాని చిత్రంయొక్క ఆశయంలో దుర్మార్గం ఉంటే సామాన్య ప్రేక్షకులు కనుక్కోలేరు.



ఆర్. పద్మనాభన్ ప్రొడక్షన్స్‌వారి "రాజేశ్వరి"లో శ్రీరంజని, శ్రీరామమూర్తి

ప్రస్తుత సెన్సార్ కోడ్ గురించి ఇంకొక అభ్యంతరంకూడా ఉన్నది. ఇది హాలీవుడ్ ప్రొడక్షన్ కోడ్‌కు అనుకరణ. అయితే హాలీవుడ్ కోడ్ చిత్రనిర్మాతలు తమ మర్యాదను తాము కాపాడుకొనేటందుకు ఏర్పరచుకొన్నది. అందులోని నిబంధనలు స్థూలంగా ఉన్నప్పటికీ, ఆచరణలో వాటిని ఏ పరిమితిలో అనుసరించాలో వారికి తెలుసు. మన దేశంలో ఈ కోడ్ ప్రభుత్వంచేత చిత్రనిర్మాతలమీద ప్రయోగించబడుతున్నది. చిత్రనిర్మాణంలో గల కష్టనష్టాలను బొత్తిగా ఎరగని అధికారులు, స్థూలంగా ఉన్న ఈ కోడ్‌ను ఆచరణలో తమ ఇష్టంవచ్చినట్టు భాష్యం చేసి చిత్రాలను సెన్సార్ చేస్తున్నారు. ఇందువల్ల చిత్రనిర్మాతలు చాలా చిక్కులకు లోనవుతున్నారు.

వీరి చిక్కులు అర్థం చేసుకోవటానికి ఒక్క ఉదాహరణ చాలు. ఒకానొక చిత్రంలోని ఒకానొక పాటలో ఒకమాట అసహ్యంగా ఉన్నది, దాన్ని తీసివెయ్యమంటారు సెన్సార్‌వారు. వచనంలో ఒక్కమాట కత్తిరించినా ఎంతో చిక్కున్నది. బొమ్మకంటె సౌండ్ ట్రాక్ కొంచెం కిందిగా ఉంటుంది. అందుచేత ఆ మాటమాత్రమే కత్తిరించటం సాధ్యం కాదు. అందుచేత ఆపాట్ తాలూకు నెగటివ్, సౌండ్, మళ్లీ పైకితీసి రెంటిలోనూ కత్తిరింపులు చేసి మళ్ళీ ప్రింట్ చెయ్యాలి. ఇంతా కష్టపడినా బాక్‌గ్రౌండ్ మ్యూజిక్ పోతుంది. ఆ పాట్ చివరదాకా సంభాషణ ఉన్నట్టయితే అందులో దాదాపు ఒక అడుగు అవతలి పాట్‌మీదికి పోతుంది. దాన్ని మళ్ళీ ప్రింటు చెయ్యాలి. ఇదంతా చేసినా మాట కత్తిరించటంవల్ల "కంటిన్యుయిటి" చెడి "జెర్క్" వస్తుంది. ఇదంతా సెన్సార్ బోర్డ్‌సభ్యుల్ని బాధించదు. ఆత్మగౌరవంగల చిత్రనిర్మాత కంటిన్యుయిటి చెడకుండా ఉండేగలందులకు ఎన్నిపాట్లు పడతాడో, ఎక్కడన్నా కంటిన్యుయిటీ చెడితే ఎంత అవమానపడతాడో సెన్సార్ బోర్డ్‌సభ్యులకు తెలీదు. పోనీ కత్తిరించమన్న ఆమాట నిజంగా అభ్యంతరకరమైనదని సెన్సార్ కోడ్ ఖచ్చితంగా రుజువుచేస్తుందా అంటే చెయ్యదు. సెన్సార్ బోర్డ్‌వారిది తుదితీర్పు!" దానిపై అప్పీలు లేదు.

ప్రభుత్వంవారు సెన్సార్ కోడ్ తయారుచేసి, దాన్ని తమ నియోగితులద్వారా అమలు జరపడమే తప్పనిసరి అయేపక్షాన ఫిలింకోడ్ శాసనాలవలె నిర్దుష్టంగా, నిక్కచ్చిగా, న్యాయస్థానంవారి తీర్పుకు తట్టుకునేలాగు ఉండాలని కొందరు భావిస్తున్నారు. ఇందులో ఆక్షేపించవలసినదేమీ లేదు.

మన దేశంలో హాలీవుడ్ ప్రొడక్షన్ కోడ్ అమలు చెయ్యటంలో అర్థంలేదు. ఎందుకంటే మన దేశంలో సెన్సార్ కాని చిత్రాన్ని ప్రదర్శించటానికి ప్రభుత్వం ఒప్పుకోదు. అమెరికాలో సెన్సార్ కాని చిత్రాన్ని ప్రదర్శించవచ్చు. సెన్సార్ కాని చిత్రం ప్రదర్శిస్తున్నప్పుడు అందులో లోపాలేవైనా ఉంటే వాటికి హాలీవుడ్ పరిశ్రమ జవాబుదారి కాదన్నమాట. ఆ సంగతి తెలిసి ఎగ్జిబిటర్లు చిత్రాన్ని ప్రదర్శిస్తారు, డిస్ట్రిబ్యూటర్లు డిస్ట్రిబ్యూట్ చేస్తారు, ప్రేక్షకులు చూస్తారు. అంతకంటె మరేమీ కాదు.

అమెరికా ప్రజలు తమ బాధ్యతలు గుర్తెరిగినవారు, మన ప్రేక్షకులు అమాయకులు అన్నది తాత్కాలికంగా ఒకవాదం కావచ్చు. కాని ఇప్పటిలాగా సెన్సార్ జరిగినంతకాలమూ మన ప్రేక్షకులు తమ అమాయకత్వం నుంచి ఎన్నటికీ బయటపడే అవకాశం లేదు.

చిత్ర నిర్మాణం మీద కొన్ని అంకుశాలుండవలిసిన మాట ఎవరైనా ఒప్పుకుంటారు. నాగరికతగల సమాజంలో ప్రతి వ్యక్తియొక్క వేషభాషలపైనా, ప్రవర్తనపైనా కొన్ని అంకుశాలున్నాయి కాని వాటిని ప్రభుత్వం చట్టాలద్వారా అమలు చేయలేదు. అనిర్దిష్టవ్యక్తులు సమాజానికి అపచారం చేసి సంఘవిద్రోహులుగా తయారుకాకుండా చూడటానికీ, వివిధ ప్రజావర్గాలకు గల హక్కులు నిర్వచించటానికీ శాసనాలు జరుగుతాయి. చిత్రనిర్మాణం సాగించే వ్యక్తులను దొంగలకిందా, హంతకులకిందా జమచెయ్యటం దారుణం. ఫిలిం కోడ్ సినిమాప్రేక్షకుల ఏ హక్కులనుగాని భద్రపరచటానికి తయారయిందనుకోవటానికి అసలే వీలు లేదు.

అందుచేత ఫిలింప్రొడక్షన్ కోడ్ తయారుచేసే భారాన్ని చిత్రనిర్మాతలకే వదిలి, సెన్సార్ బోర్డులలో పనిచెయ్యటానికిగాను చిత్రనిర్మాణంగురించి విశేషానుభవంగలవారిని నియమించటం సరిఅయిన పని. చిత్రాలద్వారా జాతికి ప్రమాదం కలిగే పరిస్థితే ఏర్పడేపక్షాన అటువంటి చిత్రాలను తీసేవారిని దండించటానికి దేశంలో శాసనాలు లోపించవు. ★

**ప్రెస్ షోలు :**

ఈస్టర్న్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి

## ★ లావణ్య ★

[తమిళ చిత్రం]

అక్టోబరు 4 ఉదయం 10 గంటలకు మద్రాసు రాజకుమారీటాకీస్ లో పై చిత్రం పత్రికలవారికి చూపబడింది. ఇందులో పాపనాశనం శివన్ గారి అనేక పాటలూ, బేబీ కమల నృత్యాలూ ప్రత్యేకాకర్షణ. కథలో వైచిత్రి కొద్దిగా ఉన్నది గాని జిగి లేదు. ఇందులో ప్రధానపాత్ర సూర్యప్రభ ధరించి ఉన్నంతలో చక్కగా నిర్వహించింది. ప్రధాన పురుషపాత్రను ధరించిన టి. ఇ. వరదన్ సంతృప్తికరంగా లేడు. పులిమూటహాస్యం కూడా చెప్పుకోదగి లేదు. ఈ చిత్రం వాహినీస్టూడియోలో, అనేకమంది వాహినీ టెక్నిషియనుల సహాయంతో తయారుచేయబడింది. ఈస్టర్న్ ఆర్ట్ వారు ఇకముందు ఇంకామంచి చిత్రాలు తీయటానికి కృషి చేయాలి.

జ్ఞానాంబికావారి

## ★ మంత్రదండం ★

[తెలుగు జానపదచిత్రం]

మనుషుల్ని మాయ జేయగల దండం చేతి కర్రగా కూడా ఉపయోగించకుండా పోయింది. మహా మాంత్రికుడు మామూలు పహరావాడి చేతిలో చస్తే, యోగిని మాంత్రికురాలై కథానాయకుడి కష్టాలను దివ్య దృష్టితో కనిపెట్టటమే గాక, రక్షించవలసినవారు పెళ్లినడకలు నడిచి తుణం ఆలస్యంగా రావటంచేత ప్రాణాలు కోల్పోయిన కథానాయికను కూడా బతికించింది. మహారాజావారి మదపుటేనుగు పుష్పమాలను సరిఅయిన వారసుడి మెడనే వేసినప్పటికీ, తనకు దత్తుడైన పరాయివాడు పరాయివాడు కాడనీ, పొత్తిళ్లలో శిశువుగా ఉండి తన దుర్మార్గాన్ని గ్రహించి ఉంటాడనీ భయపడి చిన్నరాణీ అతణ్ణి చంపటానికి మాంత్రికుణ్ణి నియోగించింది. మంత్రదండం సహాయంతో అదృశ్యంగా ఎక్కడికైనా వెళ్ల గలిగిన గిరిజమంత్రదండాన్ని పొదలలో దాచి, చిన్న రాణికి చేటు తెచ్చింది. అసలు పాపం గిరిజకు రాతి మీద పడి తల పగలగొట్టుకోవటం రాసిపెట్టేవుంది. చిత్రంలోగల పాత్రలన్నీ, సన్నివేశాలతో సహా చిత్ర నిర్మాతల అడుగులకు మడుగు లొత్తాయి. సి. యస్. ఆర్. మటుకు ఎవరి అనుమతీ లేకుండా కొద్దిసేపు చాలా అద్భుతంగా నటించాడు. జ్ఞానాంబికావారి "మంత్రదండం" మద్రాసు పత్రికలవారికి వాహినీస్టూడియోలో అక్టోబరు 6 ఉదయం చూపించారు. ★



అరుణోదయ ఆరవ వార్షికోత్సవ సందర్భాన శ్రీమతి కృష్ణకుమారి శతాకోత్సవం జరిపింది.

# "పెద్దమనిషి"

(22-వ పేజీ తరువాయి)

వాణ్ణి పిలవలేదనీ అనలేం. అసలు ఆయన స్వభావమే అంత; బజార్లో నుంచుని పెద్దగా రంకెలు వేయడమంటే ఆయనగారికి అసహ్యం. వెంకట్రామయ్యగారి ప్రయత్నం లేకుండానే ఆయన చేతికర్ర చివరనున్న వెండి పన్ను పొట్లాన్ని 'అటూ ఇటూ' కదిపింది.

తారోడ్డుమీద విద్యుద్దీపకాంతిలో-పులిపిరి కాయితంలోంచి మెరుస్తూన్న దాన్ని వెంకట్రామయ్యగారి యెడంచేయి అందుకొంది. అరచేతిలో పచ్చటి దేవత! బంగారపు గొలుసు!! నరాలకు యెలక్ట్రిక్ షాక్ తగిలినట్లయింది. కళ్ళు జిగేల్‌మన్నాయి. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. పది శవరీలకు పైమాటేగాని తక్కువుండదు. దురదృష్టవంతుడు! పాపం జారవిడుచుకొన్నాడు. వెంకట్రామయ్యగారు తల పైకెత్తిచూశాడు. కాని ఆ వ్యక్తి అంతకు ముందే ఆమలుపు తిరిగాడు. అతను వెళ్ళిన వైపే ఆయనగారూ నడుస్తూన్నారు. గుండెలవేగం హెచ్చినకొద్దీ కాళ్ల వేగం తగ్గింది. మలుపు తిరిగారు, కాని ఆ వ్యక్తి దృష్టిపథంలోంచి తప్పుకున్నాడు. వెంకట్రామయ్యగారు ప్రయత్న లోపం చేశాడనడం - అసూయ కొంచెపు బుద్ధితోనే కావొచ్చు. లేక యితరుల పెద్దమనిషితనాన్ని అదృష్టాన్ని చూసి వోర్వలేకపోవడం కావొచ్చు!

వాడి అశ్రద్ధకు వెంకట్రామయ్యగారికి నిజంగానే కోపం వొచ్చింది. గొలుసుతో పాటున్న చిన్న చీటిని తీసి చూశారు. దాన్లో నయినా వాడి అడ్రసు వుండకపోతుందా అని. 'పన్నెండు శవరీల ఆరు చిన్నాలు - తొమ్మిదివందల యెరవైఆరు రూపాయల మూడున్నర అణాలు? తూకం విలువమాత్రం వున్నాయి. వాడి యెడ్రసు తెలుసుకోలేకపోయాననే నిస్పృహను, గొలుసుతూకం అణిచిపెట్టింది. ఇతరుల సొమ్ము అనే శంకను దాని విలువ తొలగించి వుత్సాహాన్ని కలిగించింది.

వెంకట్రామయ్యగారు వోసారి 'అటూ-ఇటూ' చూసి వెనక్కు తిరిగాడో లేదో పరుగు పరుగున వస్తూన్న వొహడు ఆయనగారి కళ్ళద్దాల్లో కదిలాడు. చేతిలోని గొలుసు నిశ్శబ్దంగా పక్క జేబులోకి పోయింది. నిర్వికారంగా ఎంతో గంభీరంగా - చెప్పులూ, చేతికర్ర శబ్దం చేసుకుంటూ వస్తూన్న వెంకట్రామయ్యగార్ని నిలవేశాడు ఎదురుగా వచ్చినవాడు. వాణ్ణి తను గమనించనట్టే ఏమీ జరగనట్టే చేసే ప్రయత్నం వాడిముందు ఫలించలేదు.

ఇద్దరి కళ్ళూ వోసారి కలుసుకున్నాయి.

అదేదో నన్నూ చూడనీయండీ అన్నట్టు ఆయనగారి మొహంలోకి చూశాడు కొత్తవాడు.

ఏదీ? అన్నట్టు ప్రశ్నార్థకంగా చూశారు వెంకట్రామయ్యగారు.

"అదే! మీరు రోడ్డుమీద వుంటే తీసి జేబులో వేసుకున్నారే అది!! మీముందుగా పోయాడే వాడే పాపం జారవిడుచుకున్నట్టున్నాడు. దూరంగానే నంతా చూశాన్లే!" అన్నాడు కొత్తవాడు.

వెంకట్రామయ్యగారు అయోమయంలో పడ్డారు. నిండుకుండ తొణికింది. నరాల్లో వణుకు కదిలింది. కారుతూన్న చెమటకు చొక్కా సగానికి పైగా తడిసిపోయింది. వెంకట్రామయ్యగారికి తెలీకుండానే చేతిలోకొచ్చింది జేబులోని గొలుసు. 'ఓయిదా?' అన్నట్టు ఆ గంతకుడి కళ్లలోకి చూశారు.

"పెద్ద గొలుసే! చాలా ఖరీదవుతుంది! పాపం, వాడెవరో కనుక్కొని యిచ్చి వేయకూడదూ? ఏదీ యిలా యివ్వండీ?" అంటూ చేతిలోవున్న గొలుసును పట్టుకొన్నాడు.

"అది నువ్వు చెప్పేదేంటోయ్! నీ మొహం! అమాత్రం నాకూ తెలుసు; వాడి భోగట్టా తెలియగానే యివ్వాలనుకుంటున్నాను. అందుకే గొలుసు నాదగ్గర వుంచుకొన్నాను." అంటూ వాడి చేతిలోంచి గొలుసు విదిలించుకొన్నారు.

"ఇలాంటి పెద్ద మనుష్యుల్ని చాలా మందిని చూశాంలే! ఆ పప్పులేం వుడకవు, ముందు స్టేషన్‌కు పద." గట్టిగా అన్నాడు వెంకట్రామయ్యగారి చేయి గుంజుతూ. వెంకట్రామయ్యగారు యిరుకున పడ్డారు. పోలీస్‌స్టేషన్, యిన్‌స్పెక్టరు, లాటీలు, దొంగలు, అంతా వోసారి కళ్లల్లో మెదిలారు. చేయివిదిలించుకొని రెండుఅడుగులు వేశారు "పదా" అంటూ.

వెంకట్రామయ్యగారెప్పుడూ యింత తక్కువ రకపు జనంతో ఘర్షణపడి వుండలేదు! ఈ రోజు వీడితో యిలా ఘర్షణపట్టం చాలా చిన్నతనంగా వుంది ఆయనకు. ఇంత విలువైన గొలుసు వాడికిచ్చి వది

లించుకోటమా ? పోలీసుస్టేషనుకు పోవడమా ? మధనపడ్డారు ఎంతోసేపు, ఆయనగారు.

కొంతదూరం పోగానే కొత్తవాడు ఆగి యిలా అన్నాడు. "ఆ గొలుసును ఎవరకీ కాకుండా ఏ యినస్పెక్టరు మొహానో పెట్టడం దేనికి ? మీరు దొంగకింద జమ కావడం దేనికి ? ఏదోవిధంగా మనలో మనం పర్దుకుపోవాలిగాని."

'ఏంచేద్దాం' అన్నట్టు సందేహంగా చూశారు వెంకట్రామయ్యగారు.

"ఏదో కొంత నాకు ముట్టచెప్పి గొలుసు మీరే వుంచుకోండి." రాజీమార్గంగా అన్నాడు.

అలా వాడికి, లంచమయిచ్చి ఆ గొలుసు తను వుంచుకోటానికి వొప్పటాన వొప్పుకో లేదు. కానివాడు ఆయన గొలుసు కాజేస్తూంటే చూసినట్టు రిపోర్టుచేస్తానని, యింకేమేమో చేస్తానని, బెదిరించి, ఆయనగారి దగ్గర డెబ్బయిదు రూపాయలు, కొంత చిల్లర మొత్తం పుచ్చుకొని "దొంగ సొమ్ము జాగ్రత్తగా అమ్ముకోవాలిసుమా?" అని సలహా యిచ్చి పక్కసందు నే దూసుకు పోయాడు.

వెంకట్రామయ్యగారు గట్టిగా వొనిట్టూర్పు విడిచి యింటి మొహం పట్టారు. అంతా వో పీడకలలాగా వుంది. పక్కజేబులో బరువుగా తగుల్తూన్న గొలుసు కలకాదు 'వెయ్యిరూపాయల అదృష్టం' నిజం అంటూన్నట్టుంది.

వాడు పోతూ 'దొంగ సొమ్ము జాగ్రత్త ...సుమా!' అన్న మాటలు ఆయనగారి చెవుల్లో యింకా రింగ్‌మని మోగుతున్నాయి.

'దొంగముండా కొడుకు ? ఎంత పని చేశాడు ? ఆ దొరికిన గొలుసును ఎలాగైనా సొంత దారుడికి యివ్వాలనుకున్న తన్ను, అమోఘయంలో పెట్టి - దొంగను చేసి, డెభ్భై అయిదురూపాయలతోపాటు చిల్లర డబ్బులు కూడా వొడుక్కుపోయాడు. ఆ గొలుసు తను దాచుకోవాలని ఏకోశానా అనుకోలేదు. అలా పెద్ద బజారుకు పోయి విచారిస్తే, యీ రోజు కాకపోయినా రేపయినా గొలుసుపారేసుకున్న వాడెవరో ఆ ప్రాంతంలో తెలియకపోదు.

అయితే వాడు గుంజుకుపోయిన డెభ్భై అయిదురూపాయ లేలావస్తయ్ ? దానిసిగ తరిగిరి చిల్లరపోతే పోయింది. ఒకవేళ గొలుసు పోయినవాడు కనిపించితే సంగతి విని, నమ్మి డబ్బు యిస్తాడా ? లేక డబ్బుకోసం యీ ఎత్తువేస్తున్నాననుకుంటాడో ?' యీలా ఆలోచిస్తూ వెంకట్రామయ్యగారు వుంగిడి తిన్న గొడ్డు అయిపోయారు !

పరువు మర్యాదల్లో పుట్టి పెరిగిన వెంకట్రామయ్యగారికి యిలాంటి నీచపు సందర్భంగా పదిమంది నోట్లో పట్టం యిష్టం లేకపోయింది. తొందరపడి; వాడికి డబ్బు యిచ్చినందుకు వారి తెలివి తక్కువకు వారిమీద వారికే కోపం, అసహ్యం కలిగింది. అయినా వాడు అలా నడిబజార్లో తన్ను అల్లరిపెట్టే స్థితిలోనే వాడికి లొంగిపోవాల్సి వచ్చింది.

ఇప్పుడువిచారించీ ఏమీ ప్రయోజనం లేదు. తన డబ్బుకోసం - నలుగుర్లో అల్లరి పడకుండా వుండాలన్నా - ఒకే ఒక మార్గం - వీలైనంత తొందర్లో విసిరి పుచ్చుకుని దాన్ని పారేయడం. విసురు పుచ్చుకుని అవతల పారేశేంత తెలివితక్కువవారేం కాదు ఆయనగారు. అంటే వీలైనంత తొందర్లో ఆ గొలుసును వదిలించుకోటం. చప్పున దొంగసొమ్ము జాగ్రత్తగా అమ్ముకోవాలి సుమా!' గుర్తొచ్చి వెంకట్రామయ్యగార్ని మంత్రముగ్ధుణ్ని చేసినయ్.

'అయినా యిందులో తను కావాలని చేసింది ఏమీ లేదు. మోకాళ్ళకు తగిలిన అదృష్టాన్ని నెట్టివేయడం ఏమంత వివేకం? దొరికినసొమ్ము - దొంగ......' చిన్నప్పటి లోకోక్తి గుర్తుతెచ్చుకుని ఆత్మను సంతృప్తి పెట్టుకొన్నారు.

ఆ రాత్రి వెంకట్రామయ్యగారికి సరిగా నిద్ర పట్టలేదంటే ఆశ్చర్యపడాల్సింది దేమీ లేదు. అన్నీ పీడకలు - దొంగలు పోలీసులు, లాఠీలు జైళ్లు, గళ్ళచొక్కాలు, నంబరు బిళ్ళలు - అంతా నరకం, కళ్లు మూస్తేసరి! తాటాకు మంటల్లాగ లేచిన ఆలోచల్నకు బుర్ర వేడెక్కింది. మనసు బరువెక్కింది.

'ఈ తప్పని సరి దొంగ...' నిజంగా వెంకట్రామయ్యగారు తీరని వ్యథకు గురైనారు. తలకింద వున్న గొలుసు త్రాచుపామై పడగవిప్పి ఆయన కళ్లల్లో నాట్యం చేసింది. ఆ పాపభారాన్ని వొదిలించుకు నేదాకా ఆయనగారికి మనశ్శాంతి లేదు.

(తరువాయి వచ్చేవారం)













# ఆంధ్ర రాష్ట్రం: నెహ్రూ లేఖ

(5-వ పేజీ తరువాయి)

ఉత్తరోత్తరా ఇటువంటివాటివల్ల సంఘర్షణ పొడచూపకుండా కాపాడుకోవాలంటే, విభజనసంఘ ప్రతిపాదనలను, మిగతా పరిష్కరించబడని సమస్యలతోపాటు కేంద్ర ప్రభుత్వం స్వయంగానో, ఒక కమిషన్ ద్వారానో, లేక ఒక వ్యక్తివల్లనో పరిశీలింప చేయడం అవసరమౌతుంది. ఇందుకు కూడా కేంద్ర ప్రభుత్వం అంగీకరించబోదనే భావం వ్యాపించినందువల్లనే కర్ణాటకులు, తమిళులు కొత్త తగవులు తెచ్చిపెట్టి కొత్త సమస్యలు సృష్టిస్తున్నారు.

పరిష్కర్త నియామకానికి రెండు ప్రతికూల హేతువులు మాత్రం చెప్పవచ్చును. 1. పరిష్కర్తను నియామకానికి ఆంధ్రులు కోరుతున్నా తమిళులు నిరాకరించగలరు. 2. పరిష్కర్తవల్లనే కాని పరిష్కారం కాని సమస్యలున్నట్లయితే, అట్టి సమస్యలవల్ల దేశంలో అశాంతి చెలరేగవచ్చును. అందువల్ల పరిష్కర్త నియామకానికి అవకాశంలేకుండా సామరస్యంతో ఆ సమస్యలను పరిష్కరించవలసిందే.

ఈ రెండు ఆటంకాలను సరిగ్గా పరిశీలించినట్లయితే, ఆంధ్రరాష్ట్రనిర్మాణసందర్భంలో ఈరెండు ఆక్షేపణలూ సక్రమమైనవి కావని బోధపడుతుంది.

ఇందుకు తార్కాణంగా మద్రాసు నగరంపట్ల తమిళుల వైఖరినీ, బళ్లారిపట్ల కర్ణాటకుల వైఖరినీ గమనించవచ్చును.

ఆంధ్రరాష్ట్రనిర్మాణం సాధ్యమేనని థార్ కమిషన్ నివేదికనూ, ఆంధ్ర తమిళ కర్ణాటక కేరళ నాయకుల అభిప్రాయాలనూ పరిశీలించిన మీదటనే నెహ్రూ, పటేల్, పట్టాభిగార్లు నిర్ణయించారు. నిర్మాణ సాధ్యమని తమిళులూ కర్ణాటకులూ అంగీకరించారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి కూడా తమిళులు కర్ణాటకులు సమ్మతించారు.

ఇలా సమ్మతించిన తరవాతకూడా రాష్ట్రవిభజనవంటిసమస్యలో అందరికీ మధ్య సామరస్యం కుదరని అంశాలుండక తప్పదని నెహ్రూగారే అంగీకరిస్తున్నారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సమ్మతించిన తరవాత విభజనసమయంలో ఉత్పన్నమయే సమస్యలను సమాలోచనల ద్వారా పరిష్కరించుకోలేనప్పుడు, పరిష్కర్తనియామకానికంగీకరించబోరని చెప్పడం సక్రమమేనా? దీనికి నెహ్రూగారే సమ్మతించనప్పుడు తమిళు లెలా సమ్మతిస్తారు?

మద్రాసునగరాన్ని మినహాయించినా, ప్రస్తుత ఆంధ్రజిల్లాలతో రాష్ట్రాన్ని నిర్మించాలని స్థూలంగా నిర్ణయించినా ఇంకా పరిష్కరించబడవలసిన పెద్ద సమస్యలుంటాయని మరిచిపోరాదు.

రాష్ట్రాన్ని కోరుతున్నవారు ఆంధ్రులు. దీనికి తమిళులు కర్ణాటకులు సమ్మతించారు. ఈ పరిస్థితిలో ఏ పక్షానికిగాని అన్యాయం జరగరాదని జాగ్రత్తపడాలంటే సాధనమేది? కేవలం పరస్పర సమాలోచనల ద్వారానే ఈ సమస్యలు పరిష్కరించబడాలనీ, లేకపోతే ఆంధ్రులకు రాష్ట్రమివ్వరనీ చెప్తే దీని ఫలితమేమిటి? ఎలాగైనా రాష్ట్రాన్ని తెచ్చుకోగోరుతున్న ఆంధ్రుల వద్దనుంచి ఈ తరుణంలోనే వీలైనంత ప్రాంతాన్ని, చేజిక్కించుకోవాలని ఇతరులు ప్రయత్నిస్తారని నెహ్రూ గ్రహించలేరా?

అన్యాయానికి ఒడబడైనా సరే, దొరికినదే తీసుకుని తృప్తిపడాలని ఆంధ్రులకు నెహ్రూ చెప్తున్నారా? కర్ణాటకుల వైఖరినిబట్టి అయినా నెహ్రూ ఈ సమస్య అంతర్యాన్ని గ్రహిస్తారని ఆంధ్రదేశం ఆశపడుతుంది. కనీసం ఆంధ్ర కాంగ్రెసు నాయకులైనా ఈ సమస్యస్వరూపాన్ని స్పష్టంగా నెహ్రూకు నివేదించవలసిన అవసరం ఉంది. విభజనసంఘ నివేదికను ఆమోదించడంతో ఆంధ్రకాంగ్రెసు తృప్తిపడి ప్రయోజనం లేదు. కేవలం విభజనసంఘ నివేదికప్రాతిపదికపైన ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సమకూడదని నెహ్రూ లేఖవల్ల స్పష్టపడుతోంది. ★





# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(7-వ పేజీ తరువాయి)

జీవితాల ఛాయ లింకా చెరిగిపోలేదన్నమాట. అవింకా మనల్ని వెన్నాడుతున్నాయి."

"ఇప్పుడా విషయా లెందుకు? నే నెంత వ్యధ పడుతున్నానో గ్రహించలేవా? యౌవనంలో అనేకులు కాలు జారినా తరవాత కాలు కూడదీసుకుంటున్నారు. తెలియని తనంలో అనుభవించిన ఆనందానికి తగిన దుఃఖం వెన్నాడుతుంది. అయినా మగవారిని క్షమిస్తుంది. దుర్వర్తనను మెచ్చుకుంటుంది కూడా."

"నేను ద్రోహిని కానన్న సంగతి నీకు తెలుసు హెర్మినా. కనీసం ఏదో కారణం ఉంటేకాని మోసం చెయ్యను. నేను కఠినంగా మాట్లాడుతున్నానంటే దానికి కారణం నన్ను చుట్టుముట్టిన కష్టాలు. నా హృదయం కరడుగట్టిందంటే, అందువల్లనే ఇన్ని దెబ్బలకి తట్టుకోగలుగుతున్నాను. అలా ఉండబట్టే శత్రువుల్ని అణిచివెయ్యగలుగుతున్నాను. ఆడవారికి పశ్చాత్తాపపడే అవసరం లేదు. ఎందువల్లనంటే జరిగే దోషాలకు తప్పు వారిదికాదు; వారిని కోరికల ఆకర్షించినవారిది. మీ పాపాలకు బాధ్యులు మీరు కారు, ఇతరులు."

"ఏదెలా ఉన్నప్పటికీ, నా దోషానికి మించిన శిక్ష నాకు నిన్న రాత్రి విధించబడిందని మీ రొప్పుకుంటారా?"

"కాని ఈ శిక్ష ఇంతతో పోలేదుసుమా! జాగ్రత్త. ధైర్యం తెచ్చుకో. ఇంకా ఉంది."

"ఏమిటి? ఇంకా ఏముంది?"

"నువ్వు గతాన్నిగురించే విచారిస్తున్నావు. కాని ఇంతకంటె ఘోరకర్మ మనకోసం కనిపెట్టుకుని ఉందన్నమాట మరిచిపోవద్దు. జరిగిపోయిన విషయం నిన్నెలా తిరిగి తలెత్తింది?"

"ఏముంది? కర్మవశం."

"కాదు. అలా అనను. అటువంటిదేదీ కాదు."

"కాకపోవడ మేమిటి? మాంట్ క్రిస్టో ఆ యింటిని కొనడం, మన కతను మిత్రుడు కావడం, అక్కడే నేల తవ్వుతుండగా పసిబిడ్డ అస్థిపంజరం బైటపడ్డం, అక్కడే విందు జరగడం ఇదంతా కర్మవశంకాక మరేమిటి?"

"కాదు హెర్మినా! అదే నేను చెప్పబోయేది. మాంట్ క్రిస్టో ఆ తోటలో తవ్వించినప్పుడు ఏ పెట్టే దొరకలేదు. ఏ అస్థిపంజరమూ దొరకలేదు. అదంతా అబద్ధం."

"అబద్ధమా?" అంది హెర్మినా వెలవెలబోతూ.

"అవును అబద్ధం" అన్నాడు విల్‌ఫర్ట్ భారమైన కంఠస్వరంతో. "నే చెప్పేది పూర్తిగా విను. ఆ రోజు రాత్రి నీకు బాగా జ్ఞాపకమేనా? నువ్వు ప్రసవించినప్పుడు బిడ్డ ఏడవలేదు. కదలలేదు మెదల్లేదు. చనిపోయిందని మనం అనుకున్నాం. మెల్లిగా బిడ్డను తీసుకుని నేను తోటలోకి వెళ్ళాను. నువ్వు లేవలేక నీరసంగా మూలుగుతూ ఆ గదిలో అలాగే పడుకున్నావు. తోటలో నేల తవ్వి బిడ్డను దాచిన పెట్టె గోతిలోపెట్టి మన్ను కప్పడానికి ప్రయత్నిస్తున్నంతలో నే కార్సికన్‌వచ్చి నన్ను పొడిచాడు. నువ్వు వచ్చి నన్ను మెల్లిగా మేడమీదికి నడిపించుకు వెళ్ళావు. విరోధితో ద్వంద్వయుద్ధం చేశానని వంకపెట్టి నేను ఆరుమాసాలు సెలవుతీసుకుని దక్షిణాదికి వెళ్ళిపోయాను. తరవాత మళ్ళీ నిన్ను చూడలేదు. నువ్వు డాంగ్లర్‌ని పెళ్ళి చేసుకున్నావని తరవాత తెలిసింది.

"కాని నిత్యం నాకు ఆ బిడ్డనుగురించిన ఆలోచనే వేధించేది. ఆ యింటిని ఎవరికో అద్దెకిచ్చారు. నేను భయపడి అద్దె రద్దుపరిచి తిరిగి ఇంటిని స్వాధీనపరుచుకున్నాను. ఒక రోజున ఆ యింటికి వెళ్ళి తోటంతా తవ్వి చూశాను. కాని పెట్టికాని పసిబిడ్డకు సంబంధించిన గుర్తులుకాని ఏవీ కనపడలేదు. ఆ గుర్తులేవీ లేకుండా చెయ్యాలని నా ప్రయత్నం. కాని నా యత్నమంతా వ్యర్థమయింది. ఆ పెట్టె అక్కడ లేదు."

"అయ్యో! ఏమయింది?"

"తరవాత ఆ కార్సికన్ ఆ పసిబిడ్డశవాన్నెందుకు తీసుకు వెళ్ళాడని ఆలోచించాను. ఏడాది గడిచినా బిడ్డసంగతి తెలియక పోయేసరికి నాకు ఆందోళన అధికం కాసాగింది. బహుశా బిడ్డ బ్రతికిఉండవచ్చని నాకు అనుమానం కలిగింది. ఆ హంతకుడు రక్షించి ఉండవచ్చును."

"ఏమిటి? నా బిడ్డ బ్రతికున్నాడా? అయ్యో! బ్రతికున్న బిడ్డ నెలా పాతిపెట్టావు?"

"బ్రతికున్నట్లు నాకు తెలియదు. ఇప్పుడింకా బ్రతికున్నట్లయితే ఏం జరుగుతుందో నువ్వే ఊహించుకో. మన పని ఆఖరే."

"కాని బిడ్డ ఎక్కడున్నాడు?"

"ఎక్కడున్నాడు? ఎంత వెదికానో నీ కేం తెలుసు? అదిమొదలు నేను నిద్ర అంటే ఏమిటో ఎరగను. ఆహారం సహించదు. ఆరా తీశాను. అనాధ శిశుశరణాలయంలో వాకబు చేయించాను. ఒక గుడ్డ ముక్కలో చుట్టి ఒక బిడ్డను ఆ రోజున అక్కడ విడిచిపెట్టారని అక్కడ తెలిసింది. ఆ గుడ్డపైన హెచ్ అనే అక్షరం ఉందట."

"అయితే నా బిడ్డే! బ్రతికున్నాడన్నమాట! ఇప్పుడెక్కడున్నాడు?"

"తొందరపడకు హెర్మినా. ఆరుమాసాల తరవాత రెండో గుడ్డ ముక్క ఆనవాలు చూపి ఆ బిడ్డను ఒక స్త్రీ తీసుకువెళ్ళిందిట. అంతే తరవాత జాడ తెలియలేదు."

"అంతేనా? ఆ తరవాత ఎక్కడున్నాడో కనుక్కోలేదా?"

"ఎక్కడున్నాడో తెలియలేదు. కాని ఈనాటికీ నా ప్రయత్నం మానుకోలేదు. కాని ఇప్పుడా విషయం తిరిగి తలెత్తింది కాబట్టి మరింత పట్టుదలతో ఆరా తీస్తాను."

"కాని మాంట్ క్రిస్టోకి ఈ రహస్యం ఎలా తెలుస్తుంది? తెలిస్తే మనతో స్నేహం చేస్తాడా?"

ఈ మారు విల్‌ఫర్ట్ ఆమెవంక తీక్షణంగా చూస్తూ "నిజం

చెప్పు. నువ్వెవరికైనా మన గుప్త ప్రణయం గురించి చెప్పావా ?"

"లేదు. ఎవ్వరికీ చెప్పలేదు."

"నిద్రలో కలవరిస్తావా ?"

"లేదు. అది నీకు తెలుసుకదా !"

"సరే ఇంక నేనేం చెయ్యాలో నాకు తెలుసును. ఈ కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో ఎవరో, ఇక్కడికెందుకు వచ్చాడో, తోటలో లేని బిడ్డల శవాల్ని గురించి ఎందుకు మాట్లాడుతున్నాడో వారం రోజులలోగా ఆరా తీస్తాను."

అతని దృఢనిశ్చయాన్ని హెర్మినా గమనించింది. తరవాత ఇద్దరూ మాట్లాడలేదు. దీర్ఘయోచనానిమగ్నులై కొంతసేపు గడిపారు. కొంతసేపైన తరవాత హెర్మినా వెళ్ళిపోయింది.

ఆరోజునే విల్‌ఫర్డ్ పోలీసుశాఖాధికారికి ఉత్తరం వ్రాశాడు. రెండురోజుల తరవాత విల్‌ఫర్ట్‌కి అతనివద్దనుంచి జవాబు వచ్చింది: "కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో అనే వ్యక్తి లార్డ్ విల్‌మోర్ అనే బ్రిటిష్ దేశస్థునికి మిత్రుడు. లార్డ్ విల్‌మోర్ తరుచు పారిస్ వస్తుంటాడు. ప్రస్తుతం ఆయన ఇక్కడే ఉన్నాడు. బుసోనీ అనే సిసిలియన్ ఫాదరీ కూడా మాంట్‌క్రిస్టోకి మిత్రుడు. ఇంకా ఆరాతీస్తున్నాను."

నాలుగురోజుల తరవాత మరొక ఉత్తరం వచ్చింది: "బుసోనీ ఇప్పుడు పారిస్‌లోనే ఉన్నారు. ఇంకా నెలరోజులుంటారు. తరుచు ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటారు. లార్డ్ విల్‌మోర్ సెంట్ జార్జి వీధిలో ఉంటారు. ఆయనకి ఫ్రెంచిభాష చక్కగా వచ్చుకొని పట్టుదలకొద్దీ ఎన్నడూ ఆభాష మాట్లాడరు."

ఆమరునాడు సాయంకాలం బుసోనీ ఇంటిముందు ఒక బగ్గీ ఆగింది. నౌకరు ఆగంతకుని లోనికి తీసుకువెళ్లాడు. ఒక గదిలో బుసోనీ ఒక గ్రంథం చదువుతూ కూర్చున్నాడు.

"బుసోనీ అంటే తమరేనా ?"

"అవును. మిమ్మల్నేనా పోలీసుశాఖాధికారి పంపినది ?"

"అవునండి."

"ఏంపని చెప్పండి."

"తమరు మాంట్‌క్రిస్టోని ఎరుగున్నారా ?"

"అంటే జాకన్ మాటేనా మీరడిగేది ?"

"అది ఆయన రెండో పేరు కాబోలు. మీకు బాగా పరిచయమేనా ?"

"పరిచయమే. ఆయన మాల్టాలో ఒక నౌకానిర్మాత కుమారుడు. తండ్రితో పరిచయం అధికం."

"ఆయనకి కౌంట్ అనే బిరుదు ఎలా వచ్చింది ?"

"ఆ బిరుదు కొనుక్కోవచ్చని మీకు తెలియదా ?"

"తెలుసునండి."

"ఆయన కింత ధనం ఎక్కడనుంచి సంక్రమించింది ?"

"ఏమంత ఎక్కువ లేదు. ఒకటిన్నర, రెండుకోట్లుంటుంది. అంతే."

"మాంట్‌క్రిస్టో ద్వీపం మీకు తెలుసునా ?"

"తెలుసును."

"ఆయన గత చరిత్ర తెలుసునా ?"

"అంతగా తెలియదు."

"సైన్యంలో పని చేశాడా ?"

"చేశాడు."

"ఆయన్ని గురించి మీ కేం తెలుసు ?"

"చాలా ఉదారబుద్ధి కలవాడని అందరూ అనుకుంటారు. తూర్పుదేశాలలో క్రైస్తవమత ప్రచారానికి చేసిన సేవను గుర్తించి పోప్ బిరుదు లిచ్చారు. తూర్పుదేశాల రాజులతో అతను మైత్రి చేసుకున్నాడు."

"అతనికి మిత్రు లెవరు ?"

"అతనితో పరిచయం కలవా రందరూ అతని స్నేహితులే."

"శత్రువులు ?"

"ఒక్కడున్నాడు. అతను లార్డ్ విల్‌మోర్. భారతదేశంలో ఇద్దరూ కలిసే తిరిగారు."

"ఇంతకుముం దెప్పుడైనా మాంట్‌క్రిస్టో ఫ్రాన్స్ దేశం వచ్చాడా ?"

"లేదు. మొదటిసారి ఇక్కడికి వస్తూ ఎవరితోనైనా పరిచయం పరచవలసిందని నన్ను కోరాడు."

"ఆట్వీల్‌లో ఇంటిని కొనడంలో ఆయన ఉద్దేశ మేమిటో మీకు తెలుసా ?"

"ఇటలీలో చేసినట్లే ఇక్కడకూడా దాన్ని పిచ్చివాళ్ల ఆస్పత్రికి దానం చెయ్యాలని కొన్నాడు."

అక్కడితో బుసోనీ పరిశీలన ముగిసిపోయింది. గంటలో ఆ బగ్గీ సెంట్‌జార్జి వీధిలో లార్డ్‌విల్‌మోర్ ఇంటిముందు ఆగింది. ఆ గంతకుడు విల్‌మోర్‌ని దర్శించి పై విధంగానే ప్రశ్నించాడు. అయితే విల్‌మోర్ శత్రువుని గురించి చెప్పినట్లు జవాబులిచ్చాడు. సంభాషణంతా ఇంగ్లీషుభాషలో నడిచింది. గ్రీకుల సైనికోద్యోగిగా ఉన్నప్పుడు మాంట్‌క్రిస్టో ఒకచోట వెండి గనులు కనిపెట్టాడనీ, తరవాత గ్రీస్ రాజువద్ద అనుమతిపొంది గనులు తవ్వించి భాగ్యవంతుడైనాడనీ విల్‌మోర్ తెలిపాడు.

"ఏడాదికెంత ఖర్చు పెడుతూ ఉంటాడు."

"అతను ఒట్టి పిసినిగొట్టు."

"ఆట్వీల్‌లో అతని ఇల్లు మీకు తెలుసునా?"

"ఆ తెలుసు. ఆ సమీపంలో ఖనిజ ద్రవ్యాలేవో ఉన్నాయని అతని ఊహ. ఆ ఇల్లంతా తవ్విస్తున్నాడు మూర్ఖుడు. అక్కడేవీ తగలకపోతే చుట్టుపక్కల ఇళ్లు కూడా కొంటాడట."

"మీ యిద్దరికీ వైరానికి కారణమేమిటి?"

"వాడు నా మిత్రుని భార్యను మోసగించాడు."

"మీరేం చేశారు?"

"మూడు సార్లు ద్వంద్వయుద్ధంలో తలపడ్డాను."

ఇంతకంటె మాంట్‌క్రిస్టోనిగురించి సమాచారం తెలియలేదు. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madra



**ఐక్యరాజ్యసమితి పారిస్ సమావేశం:** నవంబరు 6-వ తేదీని ప్రారంభం కానున్న ఈ సమావేశానికి పారిస్‌లో ప్రత్యేక భవనాలు నిర్మించబడుతున్నాయి.



ఆంధ్రనాటక కళాపరిషత్తువల్ల ఉత్తమ నటకునిగా బహుమతిపొందిన ఆంధ్రరాష్ట్ర ప్రజానాట్యమండలి కార్యదర్శి శ్రీ గరికిపాటి రాజారావుగారిని, పెద్దాపురం శ్రీ భారత్ ఎమెచూర్ థియేటర్స్, శ్రీ స్వతంత్ర అభ్యుదయ ఆర్ట్ థియేటర్ వారు సెప్టెంబరు 5-వ తేదీని సత్కరించారు.